రూపములవలే నుంటున్నదియు సమస్తశబ్దములకు ఉత్పత్తి స్థానమైనదియు. సమస్త ప్రాణికోట్ల దేహిరూపమైనదియు హృదయ మధ్యమున వెలుగుచున్నదియు. ప్రపంచాతీతమై అఖండ జ్యోతి రూపమైనదియునగు గురుపాదుకను ప్రాతఃకాలమునసే హృదయమున స్మరించ వలయును.

శ్లో॥ జన్మకర్మ విలీన కారణ హేతు భూత మభూతకం జన్మకర్మ నివారకం రుచిపూరకం భవతారకం నామరూప వివర్జితం జననాయకం శుభదాయకం॥ ప్రాతరే వహిమాన సాంతర్ భావయేద్గురు పాదుకం.

తా॥ సమస్త జన్మ కర్మ వాసనల లయకారణమునకును హేతునైనదియు అజడమైజన్మ కర్మల నివారించునదియు, తేజః పుంజరూపమైనదియు సంసార సాగర తారక మైనదియు. నామ రూప రహితమైనదియు. తనకు తానే ప్రభువైనదియు శుభము నొసంగునదియునగు. గురుపాదుకను ప్రాతః కాలమునినే హృదయమును స్మరించ వలయును.

శ్లో॥ తప్త కాంచన దీప్యమాన మహాణు మాత్రమరూపకం చంద్ర కాంతర తారకైరవ ముజ్వలంపరమాస్పదం నీలనిరద మధ్యమస్తిత. విధ్యుదాది విభాసితం॥ ప్రాతరే వహిమాన సాంతర్ భా॥

తా॥ పుటము వేయు బంగారమువలే దేదీప్యమానమగుచు సూక్ష్మాణురూపమై వెన్నెల మధ్య నక్షత్రముల తెల్లకలువలవలె ప్రకాశించుచూ ఉత్కృష్టస్థానమైనదియు నీలతోయదమనబడు కంటిపాప నడుమ నుంట్టున్నదియై విధ్యుసూర్య చంద్రాది



కాంతులవలె ప్రకాశించుచున్నదియునగు. గురుపాదుకను మానసంబున ప్రాతఃకాలమునసే ధ్యానించ వలయును.

శ్లో॥ స్థూల సూక్ష్మ సకారణాంతర ఖేలనం పరిపాలనం విశ్వతైజస ప్రాజ్ఞచేతస మంతరాత్మ నిజాంశకం సర్వకారణ మీశ్వరం. నిటలాంతరాళ హారకం॥ ప్రాతరే వహిమాన సాంతర్ భావయేద్గురు.

తా॥ స్థూల సూక్ష్మ కారణశరీరాలతో అంతరమున క్రీడించునదియు విశ్వతైజస ప్రాజ్ఞుల యొక్క చైతన్య రూపమైనదియు. అంతరాత్మ తన అంశము గలదియు సమస్తమునకు కారణమయి ఈశ్వర స్వరూపమయి ఫాల భాగమున జ్ఞాన జ్యోతి రూపమయి విహరించు నదియునగు. శ్రీ సద్గురు పాదుకను.

ప్రాతఃకాలమున హృదయమున భావించవలయును.

(ఇతి శ్రీసద్గురుపాదుకాస్తోత్రం సంపూర్ణం)

(గురూపదేశమును పొందకోరిన శిష్యుడు యీ స్తోత్రమును చదువుచూ పంద్రెండు చుట్లు తిరుగుతూ ప్రదక్షిణ నమస్కారములు చేసె గుర్వష్టకములు చదువవలయును.)



# గుర్వష్టకం ప్రారభ్యతే

శ్లో॥ కళత్రం ధనం పుత్ర పౌత్రాది సర్వం గృహం బాంధవా
స్వరమే తద్ధిజ్ఞాతం గురోరంఘ్రి పద్మేమనశ్చేనలగ్నం
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం.

తా॥ మనస్సు గురుపాద పద్మములయందు పొందని మనుజునకు భార్యయును ధనమును కొమాళ్ళును మనుమలు మొదలగు సర్వమును గృహమును బంధువులను యివిఅన్నియును కలిగి యుండినను ప్రయోజనము లేదని భావము.

శ్లో॥ షడంగాది వేదోముఖే శాస్త్రవిద్యా కవిత్వాదిగద్యం సుపద్యం
కరోతి గురోరంఘ్రిపద్మే మనశ్చేనలగ్నం
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం

తా॥ యెవరి మనస్సు గురు చరణారవిందములయందా సక్తముగా యుండునో వారియొక్క ముఖమునందు షడంగములు అనగా శిక్షావ్యాకరణా చందః నిరుక్తంజోతిష్యంకల్పము మీఆరును చక్కగా పరిశీలించినను వేదములను శాస్త్రములను గద్య పద్యాది కావ్యములను రచనములుచేయబడియుండినను.ఏమియు ప్రయోజనము లేదని భావము.

శ్లో॥ విదేశేషుమాన్య స్వదేశేషుధన్యః సదాచారనిత్య సువృత్తి
ర్నచాన్యః గురోరంఘ్రి పద్మే మనశ్చేనలగ్నం
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం.

తా॥ జనుడు ఇతర దేశములయందు పూజ్యుడుగానుండినను తన దేశమునందు పుణ్యాత్మునిగానుండినను స్థిరమయిన శిష్టాచార



ములు గలవాడుగా నుండినను మంచినడత గలవాడిగా నుండినను వాని మనస్సు సద్గురునిపాద పాదపద్మముల యందాసక్తముకాని యెడల యేమియును ప్రయోజనము లేదని భావము.

శ్లో॥ క్షమామండలే భూప భూపాల బృందం సదాసేవ్యతేయస్య
పాదారవిందం గురోరంఘ్రి పద్మే మనశ్చేలగ్నం.
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం.

తా॥ భూమండలమునందు నతని పాదపద్మములను రాజ రాజుల సమూహముచే సేవింపు చుండెడువాడుగా నుండినను వాని యొక్క మనస్సు గురుపాద పద్మముల యందాసక్తాముకాని యెడల యేమియును ప్రయోజనము లేదని భావము.

శ్లో॥ నభోగే నయోగే నవా రాజ్యభోగే నకాంతముఖేనైవ విత్తేషు
యుక్తః గురోరంఘ్రి ప్రద్మే మనశ్చేనలగ్నం
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం

తా॥ జనుడు ఆకాశము గమనమును. యోగమును. భోగమును ధన సంపదలను స్త్రీ మొదలైన వాటిని గలిగి యుండినను. మనస్సు సద్గురునిపాద పద్మములయందు సక్తముగాని ఎడల యేమియును ప్రయోజనము లేదని భావము.

శ్లో॥ యశోమేగతం దిక్షు దానప్రతాపా జ్జగద్వస్తు సర్వం కరేయ
త్ప్రసాదాత్ గురోరంఘ్రి పద్మే మనశ్చేనలగ్నం.
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం

తా॥ సద్గురుని అనుగ్రహమువలన దానప్రతాపములచేత తనకీర్తి

అష్టదిక్కుల యందును నిండియు జగత్తంతయును స్వాధీనముగా నుండిన వాడుగానుండినను సద్గురుని పాదపద్మముల యందాసక్తముకాని యెడల యేమియును ప్రయోజనము లేనిదని భావము.

శ్లో॥ అరణ్యేన వాసోస్వగేహేచకార్యః సదేహే మనోవర్తతేమే.
అనార్యే గురోరంఘ్రి పద్మే మశ్చేన లగ్నం.
తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిం.

తా॥ జనుడు అరణ్యమందైనను తనయింటి యందైనను అయోగ్యమైన దేహమునందు మనస్సు పుంచక పరమాత్మయందుంచినవాడుగానుండినను సద్గురుని పాదపద్మముల యందుమనస్సు లీనము చేయక పోయిన యెడల యేమియు ప్రయోజనము లేదని భావము.

శ్లో॥ అనర్ఘ్యాణి రత్నాని యుక్తాని సమ్యక్ సమాలింగితాకామినీ
యామినీషు గురోరంఘ్రి ప్రద్మే మనశ్చేనలగ్నం.
తతఃకిం తతఃకిం తతఃకిం.

తా॥ శ్రేష్ఠములైన గొప్పమణులతో కూడుకొనిన వాడుగానుండినను రాత్రులయందు సుందరులైన స్త్రీలను కౌగిలించినవాడుగానుండినను సద్గురు పాదపద్మములయందు మనస్సు గిలించకుండిన యేమియును ప్రయోజనము లేదని భావము.

శ్లో॥ గురోరష్టకంయః పఠేత్పుణ్యదేహి యతిర్భూతి బ్రహ్మ
చారీచగేహి లభే ద్వాంచితార్థం పరబ్రహ్మ సౌఖ్యం గురో
ర్యుక్త మార్గేమనోయస్య లగ్నం.



తా॥ సన్యాసియును రాజును బ్రహ్మచారియును గృహస్తును వీరలతో నెవ్వరినైనను పవిత్రమైన దేహము గలవాడై యీ గుర్వష్టకమును పఠించునో యెవరి మనస్సు గురువు చేత చెప్పబడిన మార్గము నందు లగ్నమైయుండునో వాడు కోరబడిన ప్రయోజనమును పరబ్రహ్మానంద సుఖమును పొందునని భావము.



శి॥ శ్రీ సద్గురుదేవా శ్రీ శివరామదీక్షిత పీఠ సాంప్రదాయ ధర్మములో ఏమిటో నాకుసవిస్తారముగ తెలుప గలరని ప్రార్థిస్తున్నాను.

గు॥ బిడ్డా అటులనే తెల్పెదను శ్రద్ధగా ఆలకింపుము.

# శ్రీ గురుభ్యోన్నమః

## శ్రీ మదచల ఋషిరాముడగు శివరామ దీక్షిత గురుపీఠ సాంప్రదాయ రాజయోగ ధర్మములు

1. అహంకారము వదుల వలెను.
2. అభిమానము విడువ వలెను.
3. గురునింద వినరాదు.
4. గురు ద్రోహము చేయరాదు.

5. కుల త్యాగము చేయరాదు.
6. ఆచార త్యాగము చేయరాదు.
7. కుల దూషణ చేయరాదు.
8. కుల గురువుల నిందించరాదు
9. పర స్త్రీలను తల్లి వలే భావించవలయును
10. పర ద్రవ్యములను మట్టి పెల్ల వలె చూడవలయును.
11. సకల భూతములను తనవలెనే భావించ వలయును.
12. దేహార్థములను ప్రాణములను గురువునకు సమర్పించవలెను

.... ఈ ధర్మములననుష్ఠించు వారే పరిపూర్ణులు ....

---

శి॥ శ్రీ గురుదేవా ధర్మాలు చక్కగా వింటిని దేవా యీ బ్రహ్మ జ్ఞానము ఎరుగుటకు ఏమైన సాధనలు గలవా స్వామి.

గు॥ శిష్యా ముఖ్యసాధనలు గలవు అతిజాగ్రతగా వినుము.

## శ్రీ శివరామ దీక్షితాచల గురు సాంప్రదాయ ధర్మములు

# (శరీర రహిత ప్రకరణము)

1. దీర్ఘ కాలము శాంతుడై తామసములేక గురుసేవ చేయువారు
2. గురువును తల్లి తండ్రి దొరధాత దైవము చుట్టము పక్కముగా నమ్మేవారు.
3. గురువు యొక్క ఋణము తీర్చుకునేవారు
4. గురువు మీదనే యెల్లపుడు దృష్టిగలవారు



5. గురువు చెప్పిన సంగతిని మరువకుండా వుండేవారు.
6. గురువును ఎవరైన దూషణ చేస్తేవిని సహించనివారు.
7. గురువు వాక్యములయందు తన ప్రాణములను వినియోగ పరచువారు.
8. గురునామమును మంత్రముగా యెల్లప్పుడు పఠించువారు.
9. గురువును నరునిగా భావించక దైవముగా దలచువారు.
10. పన్రెండు సంవత్సరములు యెడతెగక గురుసేవ చేయువారు
11. గురువుకు ఒకానొక సమయమునందు తామసము కలిగినా ఓర్చుకొనువారు.
12. గురు భార్యను తల్లిగా భావించువారు.
13. గురువు కనుబడ్డచోట యెంతమంది వున్నను సందేహ పడక నమస్కరించువారు.

ఈ ధర్మములననుష్టించువారు గురూపదేశమును కరుహులు

# సాధన చతుష్ట సంపత్తి

1. నిత్యా నిత్య వస్తు వివేకము. 2. ఇహ మూత్రార్థ ఫలబోగ విరాగము. 3. షమాధి షట్క సంపత్తి 4. ముముక్షత్వము అను నాలుగు సాధనములు.

నిత్యా నిత్యా వస్తు వివేకమనగా బ్రహ్మ సత్యం జగన్మిధ్య నిత్యమైన వస్తువు పరబ్రహ్మమనిన్నీ అట్టిపరబ్రహ్మమునకు వ్యతిరేకమైన సర్వప్రపంచము అనిత్యములని సద్గురుని వలన తెలుసుకొనుటయే మొదటి సాధన అనబడును.

(ఇహ మూత్రార్ధ పలభోగవిరాగము)

2. ఈ లోకమునందలి చందనాది సుగంధముల యందను అష్ట ఐశ్వర్య భార్యా పుత్రులయందును, పరలోకము నందలి, సాలోక్యం, సామీప్య, సారూప్య, సాయుజ్య కైవల్యములను జీవబ్రహ్మైకాది పదవుల బ్రహ్మలోక పర్యంతం। యిచ్ఛ లేకయుండుట। అదియెట్లనగా మూత్రపురీషాములున్ను వమన మైన అన్నమునందు యెట్లు యిచ్ఛలేక యున్నదో అట్లే ఇహలోక స్వర్గలోక పదవులయందు యిచ్ఛలేక యుండుట ఇహమూత్రార్ధ ఫలభోగవిరాగ మనబడును.

(షమాది షట్క సంపత్తి.)

మూడవ సాధన శమము-దమము-ఉపరతి-తితీక్ష-శ్రద్ధ సమాధానమని ఆరు విషములు. 1. అంతశమము అనగా అంతరేంద్రియ నిగ్రహము మనస్సు వేదాంతవ్యతిరేకమైన విషయాదులకు వెళ్ళుచుండగా వాటిని మళ్ళించి బ్రహ్మ విధ్యా శ్రవణాదులయందు నిలుపుట. 2. దమమనగా బాహ్యేంద్రియ నిగ్రహము అనగా జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు ఈదశేంద్రియములు వేదాంత వ్యతిరేకమైన విషయాదులకు వెళ్ళుచుండగా వాని త్రిప్పి వేదాంత విషయాదులయందు నిలుపుట.

3. ఉపరతియనగా సకలమైన పాప కర్మలను విడిచి పుణ్య చింతనతో ఫలాపేక్షలేకుండా స్వార్ధరహిత కర్మాచరణలో ఆచరిస్తు దైవాదీనం జగస్సర్వం అంటూ వర్తించుట అనగా పైభాగములో కలియుట.



4. తితీక్షయనగా సీతలమునకున్ను ఉష్ణమునకున్ను సుఖము వచ్చినా దుఖఃము వచ్చినా ఒకరు దూషించినా భూషించినా సర్వకాలములయందు సమబుద్ధిగానుండుట ప్రారబ్ధముచేత ఏకాలమునకు యేధి సంభవించునోఅది అనుభవింపక తీరదని ఓర్చుకొని వుండుట.

5. శ్రద్ధఅనగా గురువుల యందును వేదాంత వాక్యముల యందును అధికమైన విశ్వాసము కలిగి యుండుట. 6. సమాధానము అనగా చిత్తమును జన్మరహితమైన మోక్ష మార్గమునందు సమాధాన పరచి ఇతర శాస్త్రములయందు కోరిక లేక యుండుట శృశాస్త్ర దృష్టంగురోర్వాక్య తృతీయం ఆత్మనిశ్చయం చతుర్ధం సంశయశ్చేదం పంచమం ముక్తిదాయకం అను శ్రుతి ప్రమాణము చెప్పున దృఢ మనస్సు కలిగి యుండుట.

4. ముముక్షత్వమనగా మోక్షాపేక్ష యోగపద్ధతిని యెరిగి జనన మరణ భ్రాంతి రహిత పద్ధతి యెరుగుట.

ఈ నాల్గు సాధనలు యెరిగి ఆచరణ కలిగిన వారే స్త్రీలు కాని పురుషులుకాని గురూపదేశమునకు అరుహాలు

నిత్య నిత్యవస్తు వివేకము॥ ఇహ మూత్రార్ధ ఫలభోగ విరాగము॥ షమాది షట్క సంపత్తీ.

ముముక్షత్వము 4గు సాధనములు

ధర్మ-అర్ధ-కామ-మోక్షము మీ నాలుగు సాధనములు వాటికి సంభందించినవి అగును.

శి॥ గురుప్రభూ మీనాల్గు సాధనలు లేక నిత్యా నిత్యా వస్తు వివేక మొక్కటి వున్నా చాలదా.

గు॥ శిష్యరత్నమా చక్కగా వినుము చాలదు ఏలననగా నిత్యా నిత్యా వస్తు వివేకము నెరిగిన పండితులు కామ్య కర్మలు ఆచరించుచు అనగా యజ్ఞములు యాగము సాకార పూజలు జరుపుతూ కాలం వృదా చేయుచున్నారు. కావున రెండవ సాధన కావలయును.

శి॥ ప్రభూ రెండు సాధనలు యెరిగిన చాలునా.

గు॥ చాలదు ఏలననగా మొదటిదిగాక రెండవ సాధన మెరిగినయతీశ్వరులు 3వ సాధనయగుశమాధి షట్క సంపత్తి లేనందు వలన కోపతాపాధికులై యితరులను శపించుచున్నారు కావున 3వ సాధన కావలయును.

శి॥ స్వామి 3 సాధనలున్న చాలునా

గు॥ బిడ్డా చాలదు అది యెట్లనగా ఈ మూడు సాదనలు గలిగిన సాధువులు మిక్కిలి శాంతమును వహించి ఎల్లప్పుడు తపస్సులయందే వుండుచు వేదాంత శ్రవణాదుల యందు నిలువని వారై యున్నారు. కావున నాల్గవ సాధనము ముక్షత్వము కావలసివచ్చెను ఇట్లు నాల్గు సాధనలు యెరిగిన వారే భోధకు అధికారి లేనియెడల కానేరరు.



# చతుర్విధ శ్రుశూషలు

1. ఆత్మ శ్రుశూష, 2. అంగ శ్రుశూష 3. స్థాన శ్రుశూష
4. భావ శ్రుశూష

1. ఆత్మ శ్రుశూష యనగా : మహాత్మ సర్వభూతాత్మగా తలంచి యితరులయందు దోషబుద్ధి యుంచక తన ప్రవర్తనయందు గురువుకు యెట్టి సందేహములు రాకుండగా త్రికరణ శుద్ధిగా ప్రవర్తించుట.

2. అంగ శ్రుశూషమనగా : తన శరీరమును, గురువు చెప్పిన సత్కార్యములయందు ప్రవర్తింప చేయుట.

3. స్థాన శ్రుశూషమనగా : గురుస్థానములకు వెళ్ళి పరిచర్యలు జేసి సద్బోధ ధర్మములు చక్కగా విని గ్రహించుట.

4. భావ శ్రుశూషమనగా : గురుమూర్తిని పరబ్రహ్మముగా తలంచి వారు చెప్పే జన్మరహితమైన వాక్యముల యందే మనస్సు నుంచి ఇతర వాక్యములను తలంచకుండుట యీ నాల్గు శ్రుశూషలు చక్కగా గ్రహించి గురునికి దయగలుగు నంతవరకు ప్రవర్తించి త్రివిధ ప్రసాదములను పుచ్చుకొనవలయును.

1వది సత్యమైన పరిపూర్ణమనిన్ని 2వది అసత్యమైనలేని యెరుకనన్ని 3వది ఈ రెండింటిని యెరిగిన యెరుకను ఒదులుట ఈ మూడు విధములను గురుడు భోదించి భ్రాంతి రహితము చేయుటయే త్రివిధ ప్రసాదములన బడును. భ్రాంతి రహితమే జన్మ రహితము.

# సప్తభూమికలు

1. స్వేచ్ఛ 2. విచారణ 3. తనుమానసి 4. సత్యాపత్తి 5. సంపత్తి 6. పదార్థ భావన 7. తుర్యమని ఏడు విధములు

1. స్వేచ్ఛ అనగా : దుస్సంగ నివర్తి గలిగి జ్ఞానము గోరుట.

2. విచారణ : సత్సాంగత్యము వలన సద్గ్రంథ పఠనము దైవ చింతన గలుగుట.

3. తనుమానసి : ఈషణత్రయ భ్రాంతి విడుచుట.

4. సత్యాపత్తియనగా : సత్యమును గ్రహించేవరకు పట్టుదలతో ఉండుట.

5. సంపత్తి అనగా : తత్వ విచారణచే ఏది మిధ్యగా దోచునో దానిని మరచుట.

6. పదార్థ భావన అనగా : త్రిపుటి అనగా దృక్కు దృశ్యము ద్రష్ట నశించి మహద్వైత సుఖముననుభవించి అనగా శాశ్వత సుఖమును పొందుట.

7. తుర్యము అనగా : తననిజ స్వరూపమును శుద్ధ జ్ఞానమే తానుగా గుర్తెరుగుట ఏడవ భూమిక అనబడును.

సహవాసే దోషే గుణాను భవంతు అనుశ్రుతి వాక్యాను సారము సామాన్య మానవులుకూడా విజ్ఞాన సహవాసము చేసినపుడు అజ్ఞానము క్రమేణ దూరమై పోవును. దుర్జన సాంగత్యము వలన దురభ్యాసములు అధికమై త్రాగుట జూదములాడుట వ్యభిచారములుచేయుట. దొంగతనము చేయుట. అబద్ధములాడుట. యివిఅన్ని



యు అజ్ఞానమును పెంచి అంధకారములో పడి చెడిపోవుదురు. కాబట్టి పైనుదహరించిన సప్త భూమికలు సాధించి మోక్షమార్గము వెతుక వలయును. నిజగురుని చేరి ధర్మలు ఆచరించి సుఖమును అనుభవింప వలయును.

శి॥ ఓ గురు ప్రభూ గురువులు అనేకులు కలరు వీరిలో బేదాభిప్రాయములు ఏమిటి. ఒటిగా తెల్పగలరని ప్రార్థిస్తున్నాను.

గు॥ సుపుత్రా తెల్పెదను వినుము ఇందులో నవవిధ గురువులుగలరు

1. బోధక గురువు అనగా శాస్త్రపురాణములు తెల్పువారు.
2. వేదక గురువు అనగా వేదోక్తకర్మలు బోధించువారు.
3. నిషిద్ధక గురువు అనగా మంత్ర తంత్రములను బోధించువారు
4. కామ్యక గురువు అనగా గుడిగోపురములు కట్టె పర్వదినములయందు ఉపవాసములు వుండుమని చెప్పువారు.
5. సూచక గురువు అనగా సాధన చతుష్టయమును బోధచేయువారు.
6. వాచక గురువు ఆత్మానాత్మ వివేకము బోధచేయువారు.
7. కారణ గురువు జీవేశ్వరైక్యము బోధచేయువారని చెప్పబడును
8. విహిత గురువు అద్వైతము బోధించి జీవన్ముక్తి పొందునట్లు చేయువారు.
9. సద్గురువు అహం పదార్థ రహితమును బోధించి మోక్షమును పొందునట్లు చేయువారు. వీరిని పరిపూర్ణ గురువులని చెప్పబడును.

శి॥ గురుదేవా భక్తిత్రయలక్షణమును తెల్పుమని మనవి చేయుచున్నాను.

గు॥ కుమారా శ్రద్ధగానాలకింపుము 1. బాహ్యభక్తి 2. అనన్య భక్తి 3. ఏకాంత భక్తి అని మూడు విధములు అందు బాహ్య భక్తిలో నవవిధ భక్తులు గలవు అవి యేవిఅనగా.

శ్లో॥ శ్రవణం. కీర్తనం. గురోస్మరణం. పాదసేవనాత్. అర్చనం. వందనం. ధ్యానం. సఖ్యమాత్మ నివేదనం.

1. అందు శ్రవణం అనగా వేదశాస్త్రములు గురుముఖతా వినుట.
2. కీర్తనం అనగా తత్వాదులు కీర్తనలు పాడుట.
3. స్మరణం అనగా గురునామమును మంత్రముగా స్మరించుట.
4. పాదసేవ అనగా గురుపాదములు పూజించుట.
5. అర్చనమనగా గురు పూజ గావించుట.
6. వందనమనగా గురువుకు సాష్టాంగ నమస్కారములు అర్పించుట
7. ధాస్యమనగా గురుసేవ చేయుట.
8. సఖ్యమనగా గురువేగతియని నమ్ముట.
9. ఆత్మ నివేదనము అనగా తను మను ధనములర్పించుట.

ఈ తొమ్మిది బాహ్య భక్తి అనబడును.

2. అనన్యభక్తియనగా సర్వ ప్రపంచము సద్గురువని భావించుట
3. ఏకాంత భక్తియనగా నేత్రమందుండెడి ఆత్మజ్యోతిని సద్గురుడని యెంచుట.

శి॥ ప్ర॥ యిట్టిభక్తి సల్పుటచేయేమి ఫలితము లభించును స్వామి

గు॥ జ॥ బిడ్డా యిట్టి సద్భక్తిపరునకు ఐదు ముక్తులు లభించును. అవిఏవి అనినా 1. సాలోక్య 2. సామీప్య 3. సారూప్య 4. సాయుజ్య 5. విదేహకైవల్యములను ఐదు పదవులు దొరుకును. యిందు.

1. సాలోక్యమనగా గురుస్థానమును విచారించుట.



2. సామీప్యమనగా గురుచెంతన చేరియుండుట.
3. సారూప్యమనగా గురు రూపుడై యుండుట.
4. సాయుజ్యమనగా గురువులో చేరి యుండుట.
5. కైవల్యము అనగా గురువులో ఐక్యమగుట.

ఈ పదములకు మీరినది పరమ పదమనబడును. గురుశిష్య రహితముగా నెరుగునది.



# అష్టాత్మల వివరము

శి॥ గురుదేవా అష్టాత్మల వివరము తెల్పుమని కోరుచున్నాను

జ॥ శిష్యా తిలకా శ్రద్ధగా వినుము 1 జీవాత్మ, 2 అంతరాత్మ 3. పరమాత్మ 4. నిర్మలాత్మ 5. శుద్ధాత్మ 6. జ్ఞానాత్మ 7. మహాత్మ 8. భూతాత్మ అనుఅష్టాత్మలు వాటివివరములు తెల్పెద వినుము.

1. దేహాద్యవ్య వ్యవహారంబులచేత నావర పడుటయే జీవాత్మ
2. శరీరము యొక్క అజ్ఞానదశను విమర్శించుటయే అంతరాత్మ
3 తనమతానెరిగిన నేను జీవుడను కాను దేవుడని ఎరుగుట పరమాత్మ.
4. స్వస్వరూపమెరిగి సదాఆనందమందుండుటే నిర్మలాత్మ.
5. ఆత్మ సర్వగత లక్షణమెరిగి లక్షణయుతముగా చరించుట శుద్ధాత్మ.
6. సకల హృదయములయందు ఆత్మయే వ్యాపించునదియని యెరుగుట జ్ఞానాత్మ.

7. సమస్త జగత్తు నాలోనే యున్నది నేను అంతటా వ్యాపించి యున్నానని యెరుగుట మహాత్మ.

8. చరాచర ప్రపంచ భూతములు ప్రాణములు సమానమేనని ఘన కించత్వములు లేవను టే భూతాత్మ యనబడును. శుద్ధ చైతన్యమైన ఆత్మయందు అష్టాత్మలు ఆరోపితమై తమతమ లక్షణములను పైనుదహరించినట్లు విశద పడుచున్నవి.

శి॥ గురుదేవా అష్టాంగ యోగముల వివరములు తెల్పుమని వేడుచున్నాను.

గు॥ పృదుకా తెల్పెద వినుము 1. యమ 2. నియమ 3. ఆసన ములు 4. ప్రాణాయామ 5. ప్రత్యాహార 6. ధ్యాన్న 7. ధారణ ౦. సమాధి యివి యోగ ముఽనబడును. విటి వివరములు.

1. యమమనగా బాహ్యేంద్రియ నిగ్రహము 2. నియమమనగా అంతరేంద్రియ నిగ్రహము 3. ఆసన అనగా పద్మాసనాది 84 ఆసనములు వేయుట. 4. ప్రాణాయామము అనగా శ్వాసో చ్ఛ్వాసలని రోదించుట. 5 ప్రత్యాహారమనగా విషయంబుల నుండి యింద్రియంబుల నిరోధించుట.



# బ్రహ్మాండ పంచీకరణము

గు॥ పుత్రకా తెల్పెద వినుము బ్రహ్మాండ పంచీకరణి తర్వాత పిండాండ పంచీకరణి తెల్పెదను శ్రద్ధగా వినుము.



1. ఆకాశము యొక్క సూక్ష్మాంశము శబ్దతన్మాత్ర శబ్దతన్మాత్ర యొక్క సూక్ష్మాంము, పరాశక్తి, పరాశక్తియొక్క సూక్ష్మాంశము అంబీజము అంబీజముయొక్క సూక్ష్మాంశము సదాశివుడు

2. వాయువు వాయువుయొక్క సూక్ష్మాంశము స్పర్శతన్మాత్ర. స్పర్శన్మాత్రయొక్క సూక్ష్మాంశము. ఆదిశక్తి, ఆదిశక్తి యొక్క సూక్ష్మాంశము యంబీజము, యంబీజముయొక్క సూక్ష్మాంశము ఈశ్వరుడు.

3. అగ్ని అగ్నియొక్క సూక్ష్మాంశము రూపతన్మాత్ర రూపత న్మాత్ర యొక్క సూక్ష్మాంశము జ్ఞానశక్తి, జ్ఞానశక్తియొక్క సూక్ష్మాంశము రంబీజము రంబీజము యొక్క సూక్ష్మాంశము రుద్రుడు.

4. జలము జలముయొక్క సూక్ష్మాంశము రసతన్మాత్ర రసత న్మాత్ర యొక్క సూక్ష్మాంశము ఇచ్ఛాశక్తి ఇచ్ఛాశక్తియొక్క సూక్ష్మాంశము వంబీజము వంబీజము యొక్క సూక్ష్మాంశము విష్ణువు.

5. పృధివి పృధివియొక్క సూక్ష్మాంశము గంధతన్మాత్ర గంధత న్మాత్ర యొక్క సూక్ష్మాంశము క్రియాశక్తి క్రియాశక్తి యొక్క సూక్ష్మాంశము లంబీజము లంబీజముయొక్క సూక్ష్మాంశము బ్రహ్మ



# పిండాండ పంచీకరణము

ఐదు సమిష్టి భూతములు ఇరువది వ్యష్టి భూతములు వాటికర్తలు వాటి గుణములు వాటి స్థానములు తెల్పెద వినుము.

1. ఆకాశము :- ఆకాశము రెండుభాగములై అందు అర్ధాంశము తన నిజాంశముతో ఉండుటచేత జ్ఞానము అయ్యెను తక్కిన అర్ధాంశము నాలుగు భాగంబులై వాయువు వ్యష్టితో కలిసి మనస్సు అగ్నివ్యష్టితో కలిసి బుద్ధిజలము వ్యష్టితో కలిసి చిత్తము పృధివి వ్యష్టితో కలిసి అహంకారము వీటి గుణములు జ్ఞానమునకు గుణము యెరుగుట మనస్సునకు గుణము చలనము బుద్ధికి గుణనిశ్చయము చిత్తమునకు గుణము చింతన అహంకారమునకు గుణము అభిమానము వీటికి కర్తలు॥ జ్ఞానమునకు కర్త కూటస్తుడు మనస్సుకు కర్త చంద్రుడు. బుద్ధికి కర్త బృహస్పతి చిత్తమునకు కర్త విష్ణువు అహంకారమునకు కర్త రుద్రుడు. వీటికి స్థానములు జ్ఞానమునకు స్థానము త్రికూటము మనస్సునకు స్థానము కంఠము బుద్ధికి స్థానము ముఖము చిత్తమునకు స్థానము నాభి అహంకారంనకు స్థానము హృదయం జ్ఞానం మనస్సు. బుద్ధి చిత్తము అహంకారము యీ ఐదున్నూ ఆకాశ పంచకంబైన, అంతరేంద్రియములన బడును. అంతరేంద్రియములచేత అంతః కరణ, ఆవరణ ప్రతి బింబము చేత వచ్చినవాడు జీవుడు. కించిత్ గుణములు గలవాడు.



2. వాయువు : రెండుభాగంబులై అందుఅర్ధాంశము తన నిజాంశముతో వుండుటచేత వ్యానవాయువు జనించెను. తక్కిన అర్ధాంశము నాలుగు భాగంబులై ఆకాశము వ్యష్టిలో కలిసి సమాన వాయువు జనించెను. అగ్నివ్యష్టిలో కలిసి వుదానము జలము వ్యష్టిలో కలసి ప్రాణవాయువు జనించెను పృదివి వ్యష్టిలోకలసి అపాన వాయువు జనించెను. వీటికి గుణములు : సమానమునకు గుణము, పచనము, వ్యానమునకు గుణము, స్పర్శ, ఉదానమునకు గుణము, వచనము, ప్రాణమునకు గుణము. శ్వాస నిశ్వాసలు అపానమునకు గుణము, విసర్జన. వీటికి కర్తలు : సమానమునకు కర్త జెయుడు. వ్యానమునకు కర్త విశ్వయోని ఉదానమునకు కర్త అజుడు. ప్రాణమునకు కర్త విశిష్టుడు. అపానమునకుకర్త విశ్వకర్త. వీటికి స్థానములు : సమానమునకు స్థానము నాభి. వ్యానమునకు స్థానము సర్వాంగములు. ఉదానమునకు స్థానము కంఠము. ప్రాణమునకు స్థానము హృదయము అపానమునకు స్థానము గుదము. సమాన వ్యాన-వుదాన ప్రాణ-అపానములు వాయు పంచకములైన ప్రాణేంద్రియములనబడును.

3. అగ్ని రెండు భాగంబులై అందు అర్ధాంశము తన నిజాంశము చేయుండుటచేత చక్షువు ఆయెను తక్కిన అర్ధాంశము నాలుగు భాగంబులై ఆకాశము వ్యష్టిలో కలసి శ్రోత్రము వాయువు వ్యష్టిలో కలసి త్వక్కు జలము వ్యష్టిలో కలసి జింహ్వ పృథివి వ్యష్టిలో కలసి ఘ్రాణము వీటి గుణములు : శ్రోత్రమునకు గుణము శబ్దము త్వక్కునకు గుణము స్పర్శ చక్షువునకు గుణము రూపము జింహ్వనకు గుణము రసము ఘ్రాణమునకు గుణము గంధము. వీటికర్తలు : శ్రోత్రమునకు కర్త దిక్కులు త్వక్కునకు కర్త వాయువు చక్షువునకు కర్త సూర్యుడు

జింహ్మకు కర్త వరుణుడు ఘ్రాణమునకు కర్త అశ్వనీ దేవతలు. వీటికి స్థానములు : శ్రోత్రమునకు స్థానము చెవులు త్వక్కునకు స్థానము చర్మము చక్షువునకు స్థానము కన్నులు జింహ్మకు స్థానము నాలుక ఘ్రాణమునకు స్థానము ముక్కు శ్రోత్రము త్వక్కు చక్షు జింహ్మ ఘ్రాణము ఈ అయిదు అగ్ని పంచకంబైన జ్ఞానేంద్రియములనబడును.

4. జలము : రెండు భాగంబులై అర్ధాంశము తన నిజాంశముతో వుండుటచేత రసము ఆయెను తక్కిన అర్ధాంశము నాలుగు భాగంబులై అకాశము వెస్టిలో కలిసి శబ్ధము వాయువు వెస్టిలో కలిసి స్పర్శ అగ్నివెస్టిలో కలిసి రూపము పృధివి వెస్టిలో కలిసి గంధము ఆయెను వీటికి గుణములు : శబ్ధమునకు గుణము శబ్ధము స్పర్శకు గుణము స్పర్శ రూపమునకు గుణము రూపము రసమునకు గుణము రసము గంధమునకు గుణము గంధము. వీటికి కర్తలు : శబ్ధమునకు కర్త సదాశివుడు స్పర్శకు కర్త ఈశ్వరుడు రూపమునకు కర్త రుద్రుడు రసమునకు కర్త విష్ణువు గంధమునకు కర్త బ్రహ్మ వీటికి స్థానములు : శబ్ధమునకు స్థానము చెవులు స్పర్శకు స్థానము చర్మము రూపమునకు స్థానము కన్నులు రసమునకు స్థానము నాలుక గంధమునకు స్థానము "ముక్కు" శబ్ద స్పర్శ-రూప-రస గంధములు ఈ ఐదున్ను జల పంచకములైన విషయేంద్రియములనబడును

5. పృధివి : పృదివి రెండు భాగంబులై అందు అర్థాంశము తన నిజాంశముతో ఉండుటచేత గంధము ఆయెను తక్కిన అర్ధాంశము నాలుగు భాగంబులై ఆకాశము వెస్టిలో కలసివాక్కు వాయువు వెస్టిలో కలిసి పాణి అగ్ని వెస్టిలో కలిసీ పాదము. జలము



వెస్టిలో కలిసి గుహ్యము. వీటి గుణము : వాక్కునకు గుణము వచనము పాణికి గుణము దానము పాదమునకు గుణము గమనము గుహ్యమునకు గుణము ఆనందము గుదమునకు గుణము విసర్జన. వీటికి కర్తలు : వాక్కునకు కర్త ఆగ్ని పాణికి కర్త ఇంద్రుడు పాదమునకు కర్త ఉపేంద్రుడు. గుహ్యమునకు కర్త బ్రహ్మ గుదమునకు కర్త మృత్యువు. వీటికి స్థానములు : వాక్కునకు స్థానము నోరు పాణికి స్థానము చేతులు పాదమునకు స్థానము కాళ్ళు గుహ్యమునకు స్థానము ఉపస్థము గుదమునకు స్థానము వాయువు వాక్కు-పాణి-పాదము గుహ్యము-గుదము ఈ ఐదున్ను పృదివి పంచకములైన కర్మేంద్రియములనబడును.

గు॥ శిష్యాతిలకా ఇది సాంఖ్య విచారణ పరమాత్మ యిన్ని యింద్రియములు కూడుకొని జీవునిగామారి మాయాభ్రాంతిలో నగిపోయాడు కావున ఈ యింద్రియములను లయింపచేసి మోక్షమార్గము చేరవలయును.



# స్థూల పంచీకరణా చక్రం

శి॥ గురుదేవా! మహావాక్య విచారణ తెల్పగలరని మనవి.

గు॥జ॥ శిష్యా రత్నమా శ్రద్ధగా ఆలకింపుము.

1. ప్రజ్ఞానం బ్రహ్మ ఋగ్వేదము జ్యోతిష్యము
2. అహం బ్రహ్మాస్మి యజుర్వేద వాక్యము అనగా వైద్యం
3. తత్వమసి బ్రహ్మ సామవేద వాక్యము అనగా ఆత్మజ్ఞానం (సంగీత విద్య)
4. అయమాత్మ బ్రహ్మ అధర్వణ వేదము (అనగా మంత్ర శాస్త్రము)
5. సర్వం ఖల్విధం బ్రహ్మ ప్రణవవేదము (వేదాంతం)

1. అందు ప్రజ్ఞాన బ్రహ్మ మనగా! సమస్త విషయాదులను తెలుసుకొనే తెలివి. ఆ తెలివే బ్రహ్మమని ఋగ్వేద వాక్యం.
2. అహం బ్రహ్మాస్మి అనగా! నేను అనే అహమే బ్రహ్మ నైతిని అని యజుర్వేద వాక్యం.
3. తత్వమసి బ్రహ్మ అనగా! తత్ అనగా ఈశ్వరుడనిన్ని త్వం అనగా నేను జీవుడను అసి అనగా రెండు కలసి బ్రహ్మనైతిని అనే వాక్యం తత్వమసి బ్రహ్మం సామ వేదము.
4. అయమాత్మ బ్రహ్మమనగా! ఈ ఆత్మయే నేను నేనే ఆత్మను. నాకు ఆత్మకు భేదములేదు. కావున ఆత్మయే బ్రహ్మననుట. అయమాత్మ బ్రహ్మం అధర్వణ వేద వాక్యము.



5. ప్రణవవేదము అనగా ఈ నాలుగు బ్రహ్మలుకూడ నేనుఉన్న వరకే తోచును. నేను లేని స్థితిలో ఏ బ్రహ్మలులేవు. అండ పిండ బ్రహ్మాండముల ఆవల ఈవల వుండబడే అచల బ్రహ్మం గుర్తెరిగి ఈ తెలివి అనే యెరుకను లేనిదని నిశ్చయించి నిశ్శబ్ధ బ్రహ్మములో తాను లేనని గుర్తెరిగినపుడు అంతా బ్రహ్మమే అచల పూర్ణస్థితిని పొందనపుడే జన్మరాహిత్యమనే మోక్షము సిద్ధించును. జనన మరణ భ్రాంతి రహితం అచల గురువును చేరి తెలుసుకొనవలయును.

శి॥ శ్రీమదఖండ అచలగురుదేవా అమనస్కయోగమును తెల్పి యెరుక రహిత ప్రకరణ పూర్ణ బ్రహ్మ స్థితిని కుదిరించగలరని అనేక విధముల ప్రార్ధించుచున్నాను గురుదేవా

గు॥ శిష్యాతిలకా శ్రద్ధగా ఆలకింపుము మొదట పంచకోశ నిరూపణ తెల్పి అయనస్క యోగస్థితిని తెల్పెద వినుము.

1. అన్నమయ, 2. ప్రాణమయ, 3. మనోమయ, 4. విజ్ఞానమయ, 5. ఆనందమయ, 6. హిరణ్మయకోశం అని ఆరు విధములు గలవు.

1. అన్నమయ కోశము అనగా! నరములు. మాంసము, యెముకలు, రక్తముతో నిండియున్నదే అన్నమయ కోశమనబడును
2. పంచ ప్రాణములు ఐదు కర్మేంద్రియములైదు కలసి ప్రాణమయ కోశము.
3. జ్ఞానేంద్రియములైదు మనస్సు కలసి మనోమయకోశము.
4. జ్ఞానేంద్రియములైదు బుద్ధి కలసి విజ్ఞానమయ కోశము అనబడును.

5. నిశ్చయాత్మకమగు బుద్ధి ఆనందమయ కోశము.

6. ఏదిఐదు కోశములకు మూలకారణమై అధిష్టానమై బంగారు రంగు ఆవరణ గలదై త్రికూట స్థానమును సుషుమ్నా అంతర్గతమై నిష్కళంకమై స్పటికాకార స్వరూపమై సర్వకాలముల యందు చలనములేక సర్వసాక్షియై అతీతర్పయులైన దేదియో అదియేహిరణ్మయ కోశము ఈ ఆరుకోశముల యందంతటా వ్యాపించియున్న మనోవృత్తి ప్రాణమయ కోశమునకు దిగజారెనేని అన్నమయ కోశములో చేరును. సప్తద్వీపనివాసము రక్తమారిస భక్షణ రాక్షసకృత్యములు హింసాకాండ నొనర్చుట మొదలగు సప్తవ్యసనాగ్రస్థుడై యుక్తివాదములు చేయుచు స్వార్థప్రియత్వముచే అధికారవ్యామోహము ఆత్మస్థితి, పర నింపజేయుచుండును. పైనపేర్కొనిన మనోవృత్తి విజ్ఞానమయ కోశమునకు యెగబ్రాకెనేని, ఆనందమయ కోశములో చేరి దేవగుణంబులు గలిగి సత్యవ్రత సంపన్నుడై లోకకళ్యాణార్థమై సేవచేయుచు సజ్జన సాంగత్యము మితా ఆహారము మిత నిద్ర, మిత సంభాషణ, మనో నిర్మలతా, సర్వభూతదయ అతిథి అభ్యాగతి పూజ వేదాంత శ్రవణ పఠన చేయుచు నిత్యానంద స్వరూపుడై ఆరవ హిరణ్మయ కోశములో చేరును కావున సంకల్పమే మనసు, నిస్సంకల్పమే మనసులేని అమనస్క మనబడును.





# తారక యోగము

శి॥ ఓగురుదేవా తారకయోగమును తెల్పుమని కోరుచున్నాను.

గు॥ శిష్యాతిలకా తెల్పెద నిశ్చలబుద్ధితో వినుము. తారకమనగా జనన మరణములనెడి మహా దుఃఖసాగరము నుండి దాటించి మోక్షమున చేర్చునదే తారకమనబడును. సోహంభావధ్యానమే నిన్ను తరింపచేయగలవు పింగళా మార్గములు జపతప యజ్ఞయాగాది క్రతువులు యెన్ని జేసినను యీ పరమ పావనమైన హంసమార్గమే నిజమైన తారక యోగమని శ్రీరామ చంద్రుడు తననిజ భక్తుండగు శ్రీ ఆంజనేయుల వారికి భోధించిన రహస్యము సోహం అను రెండక్షరముల మంత్రమే తారకము తనరకమును తెలియ చేయునదియే తారకము అందరికి దొరకుట చాలకష్టతరము కాన తారకము నిజగురునిచే తెలియ వలయును బిడ్డా చెప్పుచున్నాను. వినుము మనలో వెన్నుయెముక గలదు దానికి ఏడు చక్రాలున్నవి అవిఏవి అనిన 1. ఆధార 2. స్వాధిష్ట 3. మణిపూరక 4. అనాహత 5. విశుద్ధ 6. ఆగ్నేయ 7 సహస్రారము అను ఈ యేడు చక్రాలు గలవు.

1. ఆధార చక్రము గుదస్థానము దీనికి ధళములు నాలుగు వ-శ-ష-స అనునాలుగు అక్షరములుండును. అచ్చట పృదివి భూతం చతుష్కోణాకారము యెరుపు వర్ణము కింకిణి నాధము సద్భక్తి క్రియాశక్తి లంబీజము దీనికి గణపతి ఆదిదేవత ఆరు వందలు (600) హంస జపము జరుగును.

2. స్వాదిష్టాన చక్రము లింగస్థానము దళములు 6 బ-భ-మ-య

ర-ల అను ఆరు అక్షరములుండును. అచ్చట జలభూతముం డును. అర్ధచంద్రాకారము, విద్యుత్ కాంతి, వీణానాధం, సైష్టికశక్తి, జ్ఞానశక్తి వంబీజము 6000 హంసలు బ్రహ్మ ఆధి దేవతయై యుండును.

3. మణిపూరక చక్రమునకు, నాభిస్థానము 10 దళములు డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ 10 అక్షరములు త్రికోణాకారము, అగ్నిభూతము, శ్యామల వర్ణము, వేణునాధము, అవధానశక్తి ఇచ్ఛాశక్తి, రంభీజము, 6000 అంసలు, విష్ణువధి దేవతయై యుండును.

4. అనాహత చక్రము అనాహత చక్రమునకు హృదయ స్థానం 12 ధళములు క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ 12 అక్షరములు షట్కోణాకారము వాయుభూతము బంగారు వర్ణము, శంఖనాధము. భవశక్తి, ఆదిశక్తి, యం భీజము, 6000 హంసలు రుద్రుడు అదిదేవతయై యుండును.

5. విశుద్ధ చక్రమునకు కంఠస్థానము 16 ధళములు అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః 16 అక్షరములు వర్తులాకారము, ఆకాశ భూతము స్పటిక వర్ణము, మేఘనాదము, స్వానందశక్తి పరాశక్తి హం భీజము 1000 హంసలు ఈశ్వరుడధి దేవతయై యుండును.

6. ఆగ్నేయ చక్రము నేత్రస్థానము 2 ధళములు, హం క్షం 2 అక్షరములు త్రికోణ, వర్తులాకారము, మహత్తత్వము మాణిక్య వర్ణము ఆబ్ధినాదము, సమరస శక్తి చిచ్ఛక్తి 1000 హంసలు సదాశివుడు అధిదేవతయై యుండును.



7. సహస్రార చక్రమునకు మూర్ధనిస్థానము, 1000 ధళములు ఓంకార బీజము, షట్కోణ వర్తులాకారము, సాక్షిభూతము, చిత్రవర్ణము, ఝుంకారనాదము పరమశక్తి, సహజాత్మశక్తి 1000 హంసలు గురుడు ఆధిదేవతయై యుండును. ఈ ఏడు చక్రములందు జరుగు, హంసలు రోజుకు 21600లు జపములు జరుగును. మనకు తెలియకుండ జీవుడు జపించుచుండును దీనికి అజప గాయిత్రి అనిపేరు ఈసోహం అనుహంసను విచారించి ఆత్మపంచాంగము తెలియవలయును. అదియెట్లునగా కుడిముక్కున నడుచు శ్వాస సూర్యస్వరమనిన్ని యెడమ ముక్కున నడుచు శ్వాస చంద్రస్వరమనియును ఆదివారం ఉదయాన పడకనుండి మేల్కొరాగానే చూచినచో సూర్యస్వరం కుడిముక్కున వుండవలయును. వుండక యెడమ ముక్కున చంద్రస్వరమున్న యెడల శరీరమునకు అనారోగ్యత కారణమని తెల్సుకొనవలయును. సోమవారం ఉదయమున చంద్రస్వరముండవలయును లేకసూర్య స్వరము వున్నయెడల కోరిన పనినెరవేరదు. మంగళవారం సూర్య స్వరముండ వలయును లేక చంద్ర స్వరమున్న యెడల మృతవార్త వినిపించును. అనగా మన బంధువులేకాని స్నేహితులుగాని ప్రపంచములో ఎవరైన మృతి నొందినవారని తెలియును. బుధవారం ఉదయాన చంద్ర స్వరము యెడమ ముక్కున స్వరము వుండవలయును లేకతప్పినా తనయింటిలోకాని యితరులతోకాని కలహం జరుగును. గురువారం ఉదయాన శుక్లపక్షమునందు చంద్ర స్వరమున్న కృష్ణ పక్షమున సూర్యస్వరము వుండవలయును. వుండక తప్పినా దేశంలో అధికారులకు మంత్రులకు యుద్ధములు జగుగును. శుక్రవారం చంద్రస్వరముండవలెను. వుండక తప్పినా తనకు ప్రయాణము కలుగును. లేక తనయింటికి

బంధువులు వత్తురు. శనివారం ఉదయం సూర్యస్వరమున్నా సాయంత్రం చంద్రస్వరము వుండవలయును వుండక తప్పినా ఆరోజు మనోవ్యధ స్వజన విరోధము అపకీర్తి కోపాధిక్యత హద్దుమీరి ప్రవర్తించుట. వాహన శస్త్రాదులచే ఆపద సంభవించుట జరుగును కావున నిజగురువుచే స్వరమార్పు చేసుకొని బహుజాగ్రత్తగా జీవించవలయును.



# అమనస్క లక్షణము

సహస్రార చక్రమున అష్టదళ పద్మముండును. పద్మము ఒక్కంటికి 125 ధళములుండును. దీనికి అష్టదళ పద్మము అని పేరు యెనిమిది నూటాయిరువది యైదులు వెయ్యి దీనికి సహస్రార చక్రమని పేరు. అష్టధళముల మధ్య హంస అనగా జ్యోతి. కోటి సూర్యప్రకాశ మానముతో వెలుగు చుండును. అట్టి హంసకు చలనము గలిగినప్పుడు శ్లో॥ పూర్వధళే పుణ్యమతి ఆగ్నేయం నిద్రాలస్యం దక్షిణేక్రూరం. నైఋతేపాపం పశ్చిమే క్రీడాశక్తిః వాయువ్యేచగమనం. ఉత్తరే రతిప్రీతి. ఈశాన్యే ధర్మ చింతన. మధ్యేవైరాగ్యే కేసరే జాగ్రత్త. కర్ణికాయ స్వప్నం. లింగేశుషుప్తి. పద్మత్యాగేతురీయం అనుశ్లోకాను రీతిగాఅష్టపద్మధళములో తూర్పురేఖపై హంసయొక్క కళజోకినప్పుడు పుణ్యమైన కార్యములు లోకకళ్యాణార్థమై సత్కర్మలు సత్యవ్రత సంపన్నుడై విచారించుచుండును. హంసకళ ఆగ్నేయ రేఖపై సోకిన యెడల నిద్రవచ్చును. ఆలస్యం మందబుద్ధి కలిగి అవివేకముగా నుండును



దక్షిణ ధళముపై హంస యొక్క కళ జోకినప్పుడు మహాక్రూర చింతనకు సంభందించిన గుణములు కలుగును. దురభ్యాసములు దుర్జన సాంగత్యములు కలుగజేయును. నైఋతిరేఖపై హంస యొక్క కళసోకినపుడు ఘోరపాపమైన క్రియలు సల్పుచుండును పశ్చిమ రేఖపై హంసయొక్క కళ సోకినపుడు క్రీడాశక్తిః ఆట పాటలపై వ్యామోహము జనించును. వాయువు రేఖపై హంస యొక్క కళసోకినప్పుడు పురుకుట, తిరురుట చపలత్వ బుద్ధిగలుగును. ఉత్తరము రేఖపై హంసయొక్క కళ సోకినప్పుడు రతిప్రీతి కలుగజేయును. ఈశాన్యము ధళముపై హంసయొక్క కళ సోకినప్పుడు ధానధర్మములు జేయుట దయాగుణములు గలుగజేయును. పైనచెప్పిన ఒక్కధళమునకు 25 రకముల గుణములు కలుగుచుండును. అట్టిహంస కేసరములయందు అనగా పైభాగము ప్రకాశించుచున్నప్పుడు జాగ్రదత అవస్త జెందును. కర్ణికయందు కొద్దిదిగువ భాగములో హంసయొక్క కళ సోకినప్పుడు స్వప్నావస్థ జెందును పద్మత్యాగే తురీయం ధళమును వదిలినప్పుడు అట్టి హంస మగ్నత జెందును. దానినే తురియ అవస్థ అందురు. ఇట్టి తుర్యావస్థలో మగ్నత జెందుట వలన మనస్సు లేనిది అయిపోవును. యోగులు అట్టి స్థితిని అమనస్కయోగము అన్నారు.



# అచల పరిపూర్ణ భోద

శి॥ సద్గురు ప్రభూ పూర్ణస్థితిని యెరిగించ గలరని ప్రార్థన.

గు॥ శిష్యరత్నమా పరిపూర్ణభోద తెలియుటకు అందరికి అలవి కానిది. యెన్నియో భాదలు పడి వేదవిద్యలన్నియు పరిశోదించి నిజగురుని జేరి గురుసేవలో ప్రవీణత నొందిన ఘనులకు సిద్ధులకు సాధ్యపడును. ఆదియెట్లువగా !

కం॥ పూర్ణభోదకొరకు పురుషుండు బహుజన్మ పుణ్యవశము వలన బుట్టవలయు అట్లుగాకయున్నా అతికష్ట సాధ్యంబు అఖిల జీవ సంగ ఆత్మలింగ మనఆర్యులైన శ్రీ మద్భాగవత కృష్ణదేశికేంద్ర ప్రభువులవారు రచించిన కంద్రార్థము లు. కదపద్యములు పరిశోదించవలయును. ఇట్లు పఠించిన మహాత్ములకు పరిపూర్ణభోద అతిసులభముగా తెలియబడును.

శృతి : అనంతకోటి జన్మాని ఆత్మజ్ఞానంచ లభ్యతే ఆత్మజ్ఞాన మనంతాని లభ్యతే పూర్ణ భోదతః సుజ్ఞాన దీపమను గురు గీత గ్రంథములో 12వ శ్లోకమును 13వ శ్లోకమును పరిశీలించవలయును అవిఏవి అనగా !

శ్లో॥ 12 శైవ శాక్తాగమాదీని హ్యన్యేచ బహవోమతాః
అపభ్రంశానస్సమస్తానాం జీవనాం భ్రాంత చేతసాం॥

తా॥ వేదశాస్త్ర పురాణేతి హాసములను మంత్ర యంత్రాదికములను శైవా గమాదులును అనేకములుగు సాంఖ్యాది మతములును ఇవియన్నియును అజ్ఞానమువలన స్వస్వరూపమును దెలియక అవాస్తవమగు దేహాది ప్రపంచమును జూచుచుండెడి జీవులయొక్క అజ్ఞానపు పనులే.



శ్లో॥ 13 జప స్తపో వ్రతంతీర్థం యజ్ఞోదానం తదైవచ
పరుతత్వ మవిజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ప్రియే॥

తా॥ ఓ పార్వతీ! జనుడు గురు స్వరూపము యొక్క నిజస్థితిని తెలిసి కొనక, చేసెడి జపమును తపస్సును నియమమును గంగాది పుణ్యతీర్థ సేవయును యాగమును గోదానము మొదలైన ఇవియన్నియును నిష్ఫలతిమైనవే యగును.

శ్రీమత్ద్భాగవత కృష్ణప్రభు వర్యులు 24వ కందపద్యములో కం॥ చీరర భోధలన్నిటి నొల్లరు నిజభోద దెలసి యెప్పెటి పెద్దల్ పొల్లని యందుకెనేనని పల్లక యీ భోధయందే వర్తిస్తుసుమీ తా॥ అనునట్లుగా ఈ పుత్తబట్టబయలే శాశ్వతమైనది సకల దేశములయందు చలనములేక సర్వకాలములయందు నిండి నిబిడీకృతమై వ్యాపించి వుండబడినదే పరబ్రహ్మము అనబడును నాయనా ఇదికూడ నీభావమునకు అందని యెడల ఇంకొక చక్కని ప్రత్యక్ష ఉపమానము వినుము. అనేక జలచరములు మహాసముద్రములో వుండును జలచరముయెక్క క్రిందమీద నాలుగు ప్రక్కల నీరు వుండును అటే రూపనామక్రియరహితమై బట్టబయలు అయిన అచల పరిపూర్ణ మహాసముద్రములో ఎండమావులవలే ఈ పిండ బ్రహ్మండ జీవేశ్వర కూటస్థరూప జగత్తు తోచబడుచుండెను. పెద్దలు దీనికి జగత్తు అని పేరు పెట్టిరి. జ అనగా జన్మించడం గ అనగాగ తింపడం తు అనగా దీనిని నమ్మరాదు అచల బ్రహ్మమునందు ఎప్పుడైన తోచబడలేదు. ఈ ఉత్తమాయ దానిలోలేదు. అచల పరిపూర్ణము అనంత పరశివ స్వరూపము. గనుక అదిఒకటి కాదు దానివలన ఒకటి లేదు ప్రపంచము ఎగ్గడూలేనేలేదు క్షేత్ర క్షేత్రజ్ఞుడు విధ్యా విధ్యలు జీవేశ్వర్లు దానిలో లేనేలేరు ఇవి అచలమందుంటే సూర్యునియందు చీకటి ఉన్నట్లే

ఉక్కు స్థంభమును పుసుగు తొలచినట్లే ఆకాశము హాని పొందినట్లె వాయువునకు రూపము వున్నట్లే నిప్పునకు చదలు పట్టినట్లే పరిపూర్ణము నందు ఏమీలేదు గురువాక్యముచేత తెలియక తెలిసితే పరిపూర్ణమే ఉన్నది లేనిదిలేనేలేదు పరిపూర్ణముతప్ప రెండవది లేనేలేదు అన్నది లేనేలేదు చెప్పేదిలేదు గనుక చెప్పబోయేదిలేదు దృక్కు దృష్యము ద్రష్ట ఎన్నడూ లేదు గనుక చెప్పేటందుకు ఏమీలెదు వినేటందుకు ఏమిలేదు. ఉన్నది ఎప్పటికైనా పోనేపోదు ఇదియే గురువాక్యము అనగా నేనులేనిది అచలము ఉన్నది అని ఆర్థము దీనిని యెరుకటయే మోక్షము దీనిని కోటిమాట్లకు మరువవద్దు ఇదియేసరి నాయనా నీఆత్మకు సరిపోయినదా లేదా శి॥ సద్గురు ప్రభు ఈ ఎరుకలేదు అని అంటిరి అదిఏలాగు లేకపోవును. పృదుకా తెల్పెద వినుము ఈ మూలము లేని గుర్తెగే శరీరము ఏమిలేదు శృతి॥ సత్యం జనవిరోదాయ అసత్యం జన రంజకం అనిఉన్నది గనుక ఎరుక భ్రమకలిగిన వారు ప్రపంచ వ్యవహార వ్యామోహము చేత దాహము అయినప్పుడు నెయ్యిత్రాగి దాహం తీర్చుకుంటాము అని డాంబికముతో దాహము అదికము అయి జనన మరణములు పొందుచున్నారు. గృతము జలము రెండూ సమానముగనే ఉన్నవి. కానివాటి గుణములువేరు అహం రహితా అచలగురు భోధకుడు ఏ విలువలేని నీటిని త్రాగి దాహముత్రీర్చుకుంటున్నాడు. నిజగురు వాక్యమును నమ్మినవారు ఉండిలెని వారు లెకనే తెలియవలయును. భ్రమరహితమే జన్మరహితము స్పష్టముగా మోక్షమును పొందుచున్నారు. ఉపనిషత్తు భాష్యమునందు పుట్టని చావనివాడే పరభ్రహ్మ అమృత స్వరూపము అనగా మృతముగానిది.

శ్లో॥ ఇంద్రజాలమిథమ్ సర్వం యధా మరు మరీ చకః ఖండితా మనాకారము వర్తతే కేవలము శివం తా॥ ఆసురీతిగా ఈ



ప్రపంచము ఇంధ్రజాలము ఇదినమ్మరాదు కలలోకి వచ్చిన వస్తువులు మేల్కొంటే ఏలాలేదో అలాగే ప్రపంచము లేదు ప్రపంచము ఉన్నదనరాదు. ఈ వుత్తబట్టబయలు ఏమిలెదు. ఈ ఉత్తబట్టబయిలుకు యెరుక మరుపులెదు. ఇంతకంటే అధికము లెదు ఈ మూలములెని గుర్తెరిగే శరీరము యేమిలెదు కోటిమాట్లకు ఇదిఏమిలెదు ఈ సిద్ధాంతమే సిద్ధాంతము శ్రీమద్రామడుగు శ్రీ శివరామ దీక్షత ప్రభుపులవారు శలవు ఇచ్చినదే సరి ఇంతకు మించినది లెదు. శి॥ సద్గురు ప్రభు శ్రీమద్భాగవత కృష్ణప్రభు వర్యులు 205వ కందపద్యము చెప్పిన రీతిగా కం॥ తల్లివి, తండ్రివి, ధాతవు, వల్లభుడవు భాంధవుడవు, వసుధీశుడవున్, తెల్లమిగదేవుడవు మీ వల్లగదా ఇట్టిభోద వర్తనవినుటల్ అని చెప్పినరీతిగా అనంతకోటి నమస్కారములచే శ్రద్ధగా వినుచున్నాను. తండ్రీ తెల్పుడు

గు॥ రత్నములకొండ వినుము భాగత కృష్ణప్రభువులు 144వ కందపధ్యము చెప్పిన రీతిగా కం॥ కలరాజు సకల సంపత్కలితుండై తానుమేలు కనలెదెచటన్ కలనిన్నువానివిధమున దలపుము తలచితివేచాలు ధన్య చరిత్రా తా॥ పూర్వకాలమున పండరినగరిలో పురంధరమహా రాజు ఉండెడి వాడు అతడు రాజ్యపరిపాలనచేస్తు ఒకతరి వేట మార్గమునకు బయలుదేరి తిరిగితిరిగి అలసట చెంది స్వనగరమున ప్రవేశించి విశ్రాంతి కొరకు స్నానమాచరించి భోజనము చేసి సభాస్తానమున సింహాసనాసీనుడై వుండగా అంతలో నిద్రవచ్చెను. నిద్రలో స్వప్నమును గాంచెను చక్కని స్త్రీ ఒకరాణిగారు వారి బంధువులు వచ్చి సమందము కుదిరించి వీరికి వివాహము జరిపించిరి వివాహములో అనేక బంధువులు స్వంత జీపులు, స్కూటర్లు బస్సులు

అనేక రేడియోలు, వీడియోలు, కెమెరాలు మేళ్యాలు అనేక ఆనందముతో వివాహము జరిగిపోయినది తర్వాత ఆ చక్కని రాణితో కాపురము చేస్తు కలలో వున్న మంత్రులు, సామంత్రులు అనేక పండితులు. గాయకులు నృత్యములు చూస్తు ఆనందపడుచుండగా అంతంలోనే సుపుత్రులైన నలుగురు కుమారులను గనియే వాళ్ళు బడికి వెళుతూ తండ్రి వద్దకువచ్చి చదివిన చదువులు చెప్పటం వాళ్ళ ఆటపాటలు చూస్తు సంతోషముతో ఎంతో కాలము గడిచినట్లుగా ఆ సిహ్మాసనముపై కలగంటూ ఉండగా కలలో తనపత్నికి అనారోగ్యమువచ్చి అనేక బాధలు పడుచుండగా విపరీతమైన డాక్టర్లువచ్చి పరీక్షలు చేస్తు ఇంజక్షను చేస్తుండగానే నిర్యాణము నొందెను అదిచూచి విపరీతమైన దుఃఖః సముద్రములో మునిగి ఏడవ సాగెను కలలో బంధువులు మహారాజ మనమందరమూ అశాశ్వతమైన తనువులెగదా కలయెంతో మనకాపురాలు అంతేఅని సమాధానము చెపుతూ కలలో బంధువులు తాను అంతాకలసి ఈ శవమును ఉంచకూడదు తొందరగా దానము చేయవలయునని మంచి గంధపు చెక్కలుతో కాష్టముపేర్చి ఈ భౌతిక శరీరమును తీసుక వెళ్ళుచుండగా నలుగురు పిల్లలు నాయనా అమ్మ చనిపోయినది మనకు దిక్కు ఎవరు అని ఏడ్చుచూ మేళాళలతో వేలజనముతో గుంపులు గుంపులుగా బయలుదేరి శ్మశానము దగ్గరికివెళ్ళి ఈమృత దేహమును కాష్టములో ఉంచి అగ్నిహోత్రమును వెలిగించగా ఈ పురంధర మహారాజు కళ్ళారా జూచి ఇంతచక్కని భార్య చనిపోయిన తర్వాత నేనుజీవించటము ఎందుకు అనివిరక్తి చెంది ఆకాష్టములో దూకబోయెను అప్పుడు ఈ సింహ్మాసనము నుంచి క్రింద పడిపోయెను. మేల్కువచ్చి చూచేవరకు ఆకాష్టములేదు. ఆపిల్లలు లేరు కలలో



వచ్చిన బంధువులు ఒక్కరుకూడ లేరు ఇలలో వున్నసభికులు మంత్రులు అయ్యో రాజుగారు క్రింద పడిపోయినారేమిటి అని తెలుసుకొనగా అప్పుడు రాజుగారికి వివేకము కలిగి మేల్కొలో ఆ బంధువులు, భార్యా పిల్లలు ఏరి అని ఆ స్వప్నములో నిజముగా తోచినప్పుడు ఈ మంత్రులు, బంధువులు ఒక్కరైన కనిపించలేదే అందుకే పెద్దల వాక్యము చొప్పిన ఇల కల రెండుడూ విచారించి చూచినా రెండూ ఒక్కటే అని నిర్ణయం చేసుకొని కల మేలుక లేని స్థానము స్థిరమైనది ఏదియని విచారించి నిజగురు ప్రభు చెంతకుచేరి జనన మరణములులేని నిజ బోధ ఎరిగి మోక్షమును పొందెను.

250 కం॥ సంశయమె జన్మహేతువు, సంశయమే గురునిమాట
చవిగొననియదీ, సంశయమే కీడ నొదవును, సంశయమెడ
బాస్తివేని చాలునువత్సా అనుమానము వదలి వేయుము
గురువు ఆజ్ఞమీరకు శ్రద్ధను వదలకుము నిద్రవచ్చేదాక నీవు
చచ్చేదాక నిజమైనది పరిపూర్ణ మనిన్ని నేను అబద్ధము
నేను మాయ అనిన్ని మరువవద్దు ఇది జన్మ రాహిత్యము
ఇదియే మోక్షము సహస్రకోటి మార్లుకు ఇదియే సిద్ధాంతము

## పరిపూర్ణబోధ సంపూర్ణం



## శ్రీమత్ నిత్యానంద సంకోజు రామచంద్రాచార్య విరచిత కీర్తనలు

ఉ॥ శ్రీ గురుదేవ మీకృపను శ్రీఘ్రముగా కృతిజేయ భూనితిన్
వేగిరమందినాదు హృధి వేదికపై నివశించి వేడ్కతో బాగుగా
శబ్ధ భావమును పల్కగజేయుము నాదువాక్కునన్ సాగిలి
మ్రొక్కుచుంటి మిము సన్నుతి జేయుచు సద్గురోత్తమా

కం॥ యిద్ధరి తల్లుల బిడ్డనా ముద్ధుగ నినువేడు చుంటి
ముదుమున కృతికిన్ శ్రద్ధనొసంగియు మరివాక్శుద్ధిని
నాకొసగుమయ్య సుజనులు మెచ్చన్

కం॥ పల్లవ పాణిరోనాదగు పుల్లంబున నిల్చియుండి
వూహాసుశబ్ధం లెల్లాబలుకం జేయుము తల్లీనిను
నమ్మి కొలుతు ధన్యచరిత్రీ

ఉ॥ నమ్మకు మాయమేను యిలనమ్మకు వేల్పుల దృశ్యరూపముల్
రమ్మిక భక్తితోను శివరాములు గన్నటువంటి భావమున్
కమ్మికనున్న పూర్ణములో కన్నది సున్నిని కాలకాలముల్
నెమ్మనమందు నమ్మ మరినేమియు లేవిక శిష్యరత్నమా

## శ్రీ స్వగురుపై కీర్తన (1)

1. వందనంబులు గొనుము గురుచాంద్రా శ్రీ అకవరపు వంశసం
యజని తాబ్జ గుణసాంద్రా అందముగ మీ మృధు పదారవింద
ములు నా హృదయ కమలమునందు నినుపూజింతు పూర్ణానంద
సజ్జన వందితాఖిల ॥వందనంబు॥



2. యన్నరా నీకరుణ గలదేవా శ్రీ వీరచార్యులు కన్నసుతనను
గావగారావా మీకున్న భక్తులకన్న నేనొకచిన్నవాడను గాన
భువిలో యెన్నరా నీజన్మలెత్తితి నిన్నుతెలియక నిజము
గురువర ॥వందనంబు॥

3. పరమ పురుషా భవము నాశాకా శ్రీ కనకమాంబకు ప్రభువరా
సద్భక్త పోషాకా నిరతమూ మమ్మేలుప్రభువని మరువకను
మీ నామమెప్పుడు స్మరణ జేయుచునుంటి కేవల సంధి తెల్పిన
సద్గురోత్తమ ॥వందనంబు॥

4. దాసుడను నను బ్రోవుయంటినీ శ్రీ కొమర బండ నివాసమందున
మిమ్ముగంటినీ హనుమదార్యుల కరుణ వడసిన ఆకవరపు
రామాచారని అలసటేమియు లేక యెప్పుడు ఆత్మ లోపల
దలచు చుంటిని. ॥వందనంబు॥

5. నేనుయనునది మాయ యంటిరి పరిపూర్ణమంతట పూనియు
న్నది. చూడుమంటిరీ దానిలోపల నన్నునీవిక తప్పకశోధించు
మనగా లేనిది లేదాయ నేనని రాని నోరాడదే గురు ॥వంద॥

6. అందముగనను బ్రోవుగురుదేవా సంకోజు రామచంద్ర దాసుని
గావగారావా వాసిగా తుమ్మలపల్లిలో వెలిసినట్టి భక్తులందరి
జన్మరహితము జేయుటకును ద్వాదశిషోడశియు తెల్పిన ॥వంద

## శ్రీ మద్రీహితానంద నేంద్రగంటి హనుమద్ గురు ప్రియ శిష్యులు లంకామాంబగారిపై కీర్తన (2)

1. లంకా రంగామాంబవమ్మా నీవు ఓంకారమునకూపై వెలసీనా
వమ్మ ॥లం॥ నామ రూపారహితానన్నేలు గురుమాతాకామాదు
లెల్లానూ కడకూ జిమ్మిన తల్లీ ॥లంకా॥

2. సాంఖ్యతారక మూలానమ్మా మాకు చక్కగా తెలిపినా స్వామీ నీవమ్మా ॥సాంఖ్య॥ మక్కువతో అమనస్కా మర్మము భోధించి చిక్కులెల్లను బాపి చింతాతీర్చితివమ్మా ॥లంకా॥

3. ధర్మా ధర్మములెల్లానమ్మా మాకు మరుగు తెల్పిన పరమా మాతా నీవమ్మా ॥ధర్మా॥ పరిపూర్ణబోదాను బట్టాబయులుగా తెల్పి యెరుక లేనిది యించూ మరుపూ విడగొట్టితిరి ॥లంకా॥

4. జననా మరణములానే భాధా మాకూ జంకూదీర్చిన జననీ గురు నీవేకాదా ॥జననా॥ తక్కినా బోధాలా దిక్కు చూడకుమాని చిక్కులూ విడదీసి చక్కాజేసితివమ్మా ॥లంకా॥

5. సాధూ సజ్జనసేవా మీకుభోధా పాదూ తెలియపరుచూ పర్వా లేదనుచూ ॥సాధూ॥ వాదూలతో పొందూ మానుకోమని తెల్పి వరవాక్యమే మమ్ముపరమూ నొందించెను. ॥లంకా॥

6. నేంద్రడాగంటి హన్మద్గురునీ బోధా యెరిగి వీడితివే లేనెరుకా భాధా ॥నేంద్రడా॥ నేలకొండపల్లి నగరమునా వెలసీయూ వేలాది భక్తులా వెతలు దీర్చిన తల్లీ ॥లంకా॥

7. ఖమ్మం పట్టణ భక్తవరులూ వేగా కామాది రహిత గురుకరుణా మృత పరులూ ॥ఖమ్మం॥ శ్రీ సరస్వతాంబగురు పరలక్ష్మీ, ధనలక్ష్మీ మరువాకా గురుపూజా స్మరణా జేసెటివారు ॥లంకా॥

8. ఆకావరపూ రామాచార్య ప్రభులూ నిర్మలానందమనే మీ ఇరు పూరి బిరుదూ ॥అక॥ జోకాతో యిరిపురికి దాసానా దాసుడౌ రామాచంద్రా దాసు రమ్యముగా బలికేనిటు ॥లంకా॥ ॥ఆక॥



## గురుపూజ కీర్తన (3)

1. గురునీ పూజింపూ జీవా ఆనంద జీవా ॥గురు॥
గురునీ పూజింపూ జీవా పరమూ నీకేమీ కొదువా
గురువార్ని నమ్మూమ్మజీవా ఆనందజీవా ॥గురు॥

2. యేడుకొండలను యెరిగేదినీవే వెంకటరమణ ప్రకాశమునీవే
ఆ కొండపైనుండూ జీవా ॥ఆనందజీ॥ ॥గురు॥

3. హరిషడ్వర్గము నణగద్రొక్కిమరి యిరువైయైదిటి వివర
మెరిగితే పరమాత్మపు నీవేకావ ॥ఆనంద॥ ॥గురు॥

4. అండా పిండా బ్రహ్మాండంబులు నిండి వెలిగే దండీ బ్రహ్మం
అండా బాయకనుండూ జీవా ॥ఆనందజీవా॥ ॥గురు॥

5. మాయా భ్రాంతిలో మరిగి నీవు మాయలో మునిగీ మారక
మునుపే మాయా మర్మమెరుగు జీవా ॥ఆనందజీవా ॥గురు॥

6. బట్టాబయలను గుట్టుతెలిసితె పుట్టు గిట్టులు వట్టివాయెను.
చిట్టా చివరకు నీవూలేవుగా ॥అనంద॥ ॥గురు॥

7. ఆత్మస్తుతి పరనిందాలేనీ ఆకావరపు రామాచార్యుల
జోకాతో వేడూజీవా ॥ఆనంద॥ ॥గురు॥

8. వాసీగా శ్రీ తుమ్మలపల్లి నివాసీ శ్రీ రామచంద్రదయ దాసా
దాసుడు నీవేకావా ॥ఆనంద జీవా॥ ॥గురు॥

## కీర్తన (4)

1. భజన చేయదము రాండీ గురుపుత్రులార లేతెండి
గురు భజన చేయుదము రాండి ॥గురు॥

2. తల్లి తండ్రి గురుదైవము నీవని తల్లడ మొందక
తధ్యముగనుగొని ॥భ॥

3. యేడుయేడు పదునాలుగు భువనాల్ ఏక చక్రముగ
యేలేటి నిజగురు ॥భ॥

4. మాయలోకమున కాయమునమ్మక మాయతీతుడగు
మద్గురు మూర్తుల ॥భ॥

5. ఆధిమధ్య అంతములులేని గురుఅఖండ తేజుని
అంతరాత్మలో ॥భ॥

6. ఓంనమః శ్రీగురుదేవాయని పరమపురుషయని
ప్రార్ధన జేయుచు ॥భ॥

7. అభిమానంబుల అణగద్రొక్కుకొని అచలమేస్థిరమని
ఆచరణలతో ॥భ॥

8. ఆలు బిడ్డలీ సంసారంబనె అంబుధిధాటను ఆత్మరామగురు ॥భ॥

9. యిమ్మహి తుమ్మలపల్లి పురంబున రామచంద్రయ
రయమున బిలుపగా ॥భ॥

## కీర్తన (5)

1. ఆనంద మానందమూ శ్రీ సద్గురుసేవా అనందమానందము.
ఆనందమానందమాయే సద్గురుసేవా అహంకారమునెల్ల అణగ
ద్రొక్కినా వారికానంద మానందము ॥శ్రీ॥

2. దాసానా దాసుడై నిజదేశికొత్తమునిజేరి దాసులాహృదయా
నివాసా మొందినావారి ॥ఆనంద॥



3. దేశదేశములు తిరిగి దేముణ్ణి తెలియాలేక దేహముగాని
విదేహమొందినా వారి ॥ఆనంద॥

4. యుగాయుగ మూలనెల్లా ఊహాతో పరిశోదించి యుగ ధర్మా
లెల్లా నెరిగీ యునికిమానీనా వార్కి ఆనంద ॥ఆనంద॥

5. వేదశాస్త్రిములెల్ల వెదకి వ్యాసాటజెందీ వాదోపావాదములను
వొదలినా వారికెల్లా ॥ఆనంద॥

6. భక్తీజ్ఞాన వైరాగ్యం బాగుగా పరిశోధించి భయ భ్రాంతులాను
వీడి బ్రహ్మంబు గన్న వారికి ॥ఆనంద॥

7. ఆత్మనాత్మలపైనా ఆదీ అంత్యములా నెరిగీ అక్షరాక్షరా
ద్వయ దోషారహితూలాకెల్లా ॥ఆనంద॥

8. పదిరెండూ పదహార్లానూ పదినైదూ పరిశోధించి పలికే
పలుకూలు మానిన పరమామహాత్ములకు ॥ఆనంద॥

9. హరిహారాదులకలవీగానీ అచలభావము అందాజేసిన ఆక
వరపూ రామాచార్యుల అండాబాయకనుండే వారికీ ॥ఆనంద॥

10. సాదుసజ్జన సాంగత్యములు సద్గోష్టి సద్గ్రింద పఠనలు సమ
రస భావముతో మెదలిన సంకోజు రామచంద్రదాసుకు ॥ఆ॥

## కీర్తన (6)

1. యెంతజెప్పిన వినవూ భగవంతుడే గురుడనవూ జీవా యెంత
జెప్పిన వినవూ వింత వింతల జగము దీని అంతూ దెలియ
ఘనమూ జీవ ॥యెంత॥

2. సాధూ సజ్జనులానూ జేరి పాదు తెలియవలెను జీవా సాధు
పెద్దలగను మికనూ నీవద్ద అహము విడునూ జీవా ॥యెంత॥

3. యెంతమాయమనసూయిది అంతలోనే మెరుసూజీవా ॥యెంత॥
కనుకంతలలో మెరసూ ఘనచింతలన్నీ జెరచు జీవా ॥యెంత॥

4. అడ్డదిడ్డము నడచీ బహుగడ్డంబులు బెంచి జీవా ॥అడ్డ॥
తనజిడ్డూ విడువమరచి మేమెదొడ్డావారమనుచూ జీవ ॥యెం॥

5. ధన ధాన్యముజూచి తను ధానధర్మము మరచీ ॥జీవాధన॥
వెంటరాదు గోచీ వినుమంటె వినదు దుర్బాషీ ॥జీ॥ ॥యెం॥

6. యెరుకనమ్మబోకూ పరిపూర్ణ మిడువబోకు ॥జీవా॥ యెం॥
స్థిరము గల్గునీకు ముందు పరముజెందే వరకు ॥జీవా॥ ॥యెం॥

7. చిట్టా చివరిజన్మ నెట్టిబట్టాబయలు గనుమా ॥జీవా॥ ॥చి॥
వట్టిమాయ విడుమా దీనిగుట్టు తెలియతరమా ॥జీవా॥ఎం

8. ఆకవరపు రామగురుడు రాకపోక తెలిపె ప్రభుడు ॥జీ॥ ॥ఆ
ప్రకట పరచే పరమూ నికలేకతోచె జగము ॥జీవా॥ ॥యెం॥

9. నాయకన్ గూడ పురమూ సవాసముండె స్థిరము ॥జీవా॥ ॥ఎం॥
రామచంద్రుని గనుము నీ కామముడుగు వినుము ॥జీవా॥ఎం





## కీర్తన (7)

1. నిన్ను నీవెరుగవేజీవా యెన్నివిధ్యలను నేర్చినను లావా ॥నిను॥
నిన్ను నీవెరుగకను యెన్నో విద్యలునేర్చి పన్నుగాబియె
యెల్పానుపొందినగాని. ॥నిన్ను॥

2. కోటు, బూటు, సూటు, నీటుగా దరియించి వాటముగా దిరిగి
నీ చోటు తెలియగలేవు. ॥నిన్ను॥

3. ధన ధాన్యములు జూచి ఘనముగా మురిసేవు మున్ను
యెందరోధనులు మన్నులో కలిసిరి. ॥నిన్ను॥జీ॥

4. జింహ్మ పస్తల భ్రాంతి సంహరించగా లేక కోహం కస్త
వంబనే మోహంబు బడనేల ॥నిన్ను॥

5. అంతః కరణంబుల చెంత జేరకనీవు వింతలన్నియు వీడి
చింతలను మానుటకు. ॥నిన్ను॥

6. అష్టాంగ యోగముల కష్టమొందగబోకు వ్యష్టి సమిష్టుల నష్ట
మొందగజేయ ॥నిన్ను॥

7. పంచముద్రలు రోసి పంచకోషముకోసి పంచవింశతిబాసి
పంచముక్తులపైన. ॥నిన్ను॥

8. నాల్గుమూడులు దెలిసి నాల్గునాల్గులు విడచి నాల్గుమూడుల
మూటినగు బాటుగాగనీ ॥నిన్ను॥

9. స్వామి ఆకవరపు రామచార్యులగని భామనెరిగించుమని
ప్రేమతోడను మ్రొక్కి ॥నిన్ను॥

10. ధరను నాయకన్‌గూడ పురమందు వెలసిన వర రామచంద్ర
యలో త్వరలోన కలియుటకు. ॥నిన్ను॥

## 8వ తత్వము

1. శ్రీగురు పదములే నమ్మితీ నమ్మితీ న్మమ్మితీ మద్గురు చర
ణమే వేడితీ వేడితీ వేడితీ ॥శ్రీ॥

2. మోస గురువులా బాసలునమ్మియు వ్యాసటపడి పడి దోషము
లెంచక బాసితి బాసితి బాసితీ ॥శ్రీ॥

3. దురుద్దేశములు దూరము జేసిన పరమ గురునినే ప్రార్ధన
జేసియు కోరితి కోరితి కోరితీ. ॥శ్రీ॥

4. ముగ్గురు మూర్తుల మూలము దెలిసియు స్వర్గము మీరిన
సద్గురు స్వామిని కూడితి కూడితి కూడితీ ॥శ్రీ॥

5. పంచతన్మాత్రల వంచన జేసియు చంచలమనసును కించపర
చినే చూచితి చూచితి చూచితీ ॥శ్రీ॥

6. అండపిండ బ్రహ్మాండంబులలో నిండివెలిగే అఖండ స్వరూపుని
కూడితి కూడితి కూడితీ ॥శ్రీ॥

7. అకార ఉకార మకారములతో ఓంకారంబుకు వఆపల బిందువు
వుంచితి వుంచితి వుంచితీ ॥శ్రీ॥

8. గురుగురు బోధల మరుగు తెలుసుకొని న గురోరధికమని
నిజగురు మూర్తిని చేరితి చేరితి చేరితీ ॥శ్రీ॥

9. యెరుకనెరుగగనె మరుపు తెలియుమని స్థిరముగ తెల్పెను
రామచారిగురు కంటిని కంటిని కంటినీ ॥శ్రీ॥



10. ధరను ధర్పుర పురమున వెలసినవర రామ చంద్రయతిరము
నుదెలుక యుంటిని యుంటిని యుంటినీ ॥శ్రీ॥

## 9వ తత్వము

1. యెందుకురా జీవా యీ భ్రమ యెందుకురా జీవా యెందుకు
మోహము జెందకున్నీలో సంధి తెలుసుకొని సాగిపోక
నీకెందుకురా జీవా ॥యీ భ్రమ యెందు॥

2. యెచటనుండి నీవిచటికొస్తివో యిచటినుండి యింకెచటి
కేగెదవో ॥యెం॥

3. ఆలుపిల్లల నిజాలములోబడి కాలము గడిపేవు కామము
వుడగక ॥యెం॥

4. అష్టమదంబుల నిష్టతోద్రుంచియు కష్టమొందకను కామమునణ
చవ దెందుకురాజీవా ॥మీ॥

5. యిరవదివక వెయ్యారు నూరులు తిరుగగ హంసలు తరుగును
ఆయువు ॥యెం॥

6. సచ్చరిత్రుడగు సద్గురు మూర్తిని నుచ్చరించి యిలయిచ్చను
విడువ దెందుకురా ॥జీవా॥

7. చెన్న కేశవాపురమున వెలసిన కన్నగురుడు కమలార్య
భోధవిను ॥యెందుకురా॥

8. శంకలుడిగి శ్రీరామ చంద్రయా పొంకముతోగనే వంకలు
లేవిక. ॥యెందుకురా జీవా॥

## 10వ తత్వము

1. యెంతపని జేసింది తెలివీ దీనిఅంతు తెలియటకేపరికలవి ఎంత
పనిజేసింది సుంతలో జగమెల్ల వింత వింతలు జేసి అంతు
లేకనుపోవు ॥యెంత॥

2. బస్సులును రైళ్ళుజేసింది దీనితస్సదీయ పురుకుతుంది లెస్సగా
నింగికీ లెగయు విమానాలు బుస్సుమని రాకెట్టు పోపునే
వెలుగునకు ॥యెంత॥

3. ఆకాశవాణి పట్టింది దీనిచేగానిదేది లేకుందీ లోకానికేమైన
చీకటిలేకుండా ప్రాకటంబుగనీటిచే కాంతి దెచ్చింది. ।యెంత।

4. ఫోనుజేసి తెలుపుతుందీ దీనిదాని వేరని పలుకుచుంది గానముకు
రేడియో గంటలకు టైమును తాజేసినది జూచిపూని
ఆనందిచు ॥యెం॥

5. వీడియోలను చూపెనండి మీదయాడజూచిన లేనిదండి పాట
లకు టేపులను, ఆటలకు టీవీలు, పట్నాలు, పల్లెలు, పరగంగ
స్థాపించే ॥యెంత॥

6. మానవుండే మాధవుండూ తెలివి తెలియకుండిన దానవుండూ
మిన్నువాయు వగ్నిమన్నునీరున బుట్టి యెన్నెన్నో చిత్రాలు
ఏర్పరచి జనుచుండు. ॥యెంత॥

7. విధ్యలెన్నో నేర్పుతుంది ఆవిధ్యను నమ్మకొనుచుందీ సతత
మూనిజగురుస్మరణయేనాదు సద్గుతియని పరిపూర్ణత
త్వంబు నెరుగక ॥యెం॥

8. బట్ట బయటను దిరుగుచుండూ దీనిగుట్టు నిజగురుని కెరకుండూ
వట్టిమాటలుగావు పట్టువీడక దీనిపుట్టిముంచినగాని పుట్టు
గిట్టులుద్దీరు. ॥యెం॥



9. ఘనుడైన నిజగురుప్రభూడు నేంద్రగంటి హనుమయ్య శిష్య
వరుడు పనిబూనుకొని అకవరపు రామయచారి వినురామ
చంద్రయ్య వీడులేనెరుకనే ॥యెంత॥

## 11వ తత్వము

1. నమ్మకో గురుదేవునీ ఓ మానసా ॥న॥ ఇమహిలోపల కమ్మ
కనున్నది గమ్యముతోడుత రమ్మిక గనుటకు ॥నమ్మ॥

2. ముప్పదిమూడు కోట్ల వేల్పులకు మూలమైన నిజగురు
దేవుని నీవు ॥నమ్మ॥

3. ఆస్తిపాస్తులూ ఆలుపిల్లలూ ఆడంబరములు అంతయు
నాస్తని ॥నమ్మ॥

4. మాయక్షేత్రమున మమతలు వీడక మాయకర్మలను మరి
మరిజేయక ॥నమ్మ॥

5. తల్లి తండ్రి గురుదేవుడు తానని యల్లలోకములు ఉళ్ళక్కని
నీవు ॥నమ్మ॥

6. అచలపీఠమున అమరులైన గురు శ్రీ॥ మద్దామడు శివరామ
దీక్షీతుల ॥నమ్మ॥

7. ద్వాదశీ షోడశీ దశపంచాక్షరీ దయతో తెల్పిన
దేశికోత్తముని ॥నమ్మ॥

8. రామచారిప్రభు రంగమాంబగురు రమ్యముగను జన్మరాహి
త్యమును జేయు ॥నమ్మ॥

9. రామచంద్రా దాసు నీమానిష్టలు దెల్ప కామామడిన తమకు
కర్మాబంధము బాయు నమ్మకో గురుదేవునీ
॥ఓ మానసా ॥నమ్మ॥

## 12వ తత్త్వము

1. వుండదురో ఈ లేనీయెరుకా దండీదని భ్రమజెందకురో అండా
పిండా బ్రహ్మాండంబులు నిండీవెలిగే మలుగుమురో ॥పుం॥

2. తల్లి గర్భము ఘోరనరకమనే తొల్లి సంగతిని మరువకురో
యిల్లు భూధనము పశువులు నాదని వల్లుమరచి నీవు
తిరగకురో ॥పుం॥

3. అకాలమృత్యువు నీకొరకయ్యె సకాలమెల్లనుగా చుమురో రకా
రకంబుల వుచ్చులు యెడ్డీ నీకాలము సరిపుచ్చుమురో ॥పుం॥

4. ఆలుపిల్లలు అక్కచెల్లెలని వలలో పడిచెడిపోకుమురో యల్ల
లోకములు నాతోవచ్చెనని యల్లమందునా తెలియమురో ॥పుం॥

5. కల్లాయని ఈనేను మేనులు తెల్లాతేటగా తెలియుమురో మళ్లీ
జన్మకు రానీమార్గాము యెల్లావేళ్ళలా తెలియమురో ॥వుం॥

6. అష్టావిధపుష్పములానెరిగి నిష్టతో పూజలు సల్పుమురో
స్పష్టముగా గురుధర్మల నెరిగితె కష్టములెల్లను
తొలుగుమురో ॥వుం॥

7. దండీగురువుల సేవాజేయుచు నింశుమనసుతో నుండుమురో
ఖండీతంబుగ జననామరణము వుండాబోదని చెండుమురో ॥వుం॥

8. బట్టాబయలను గుట్టు తెలసుకొని వట్టిమాయదిని వదులుమురో
పట్టువిడుపుగల పంచదశెరిగితే పుట్టుచావులు యెట్టివిరో ॥వుం॥



9. భూగిరి నగర నివాసియనగు శ్రీ లంకరంగమాంబ దిగనెరా
పరగ అకవర రామాచారిగురుస్థిరముగ తెల్పిన బోధిదిరోవుం

10. నట్టులేక శ్రీరామ చంద్రగయా పట్టునెరిగి ఇలా చెప్పెనురా
యిట్టి బోధను విన్నభక్తులు గట్టిగ పరమును జెందునురా ॥వుం

## 13వ కీర్తన

1. వినరా వినరా శిష్యన్న వినరా బోధను మాయన్నా కనరా
కనరా పరమును నీవన్నా జనరా లేనని మాయన్నా ॥విన॥

2 స్థాణూతస్కర భ్రాంతన్న తృణరజ్జున్యాయమురన్నా శుక్తి
రజిత మోహమురన్నా యుక్తిచె తెలియాలేదన్నా ॥విన॥

3. వంద్యాపుత్రునిగనెనన్నా దగ్ధరచనన్యాయమురన్నా శశి
వీషాణము చూసైన్నా వృశ్చిక గర్భిణి వూడన్నా ॥విన॥

4. గగనా కూనము గనెనన్నా అగ్నివమ్రిన్యాయము రన్నా
రజ్జుభుజగము రీతన్నా ముజ్జిగంబులు మునుగన్నా ॥విన॥

5. యక్షరాజధానియుగన్నా చక్షుదీప నాయమురన్నా నరస్వప్న
ము ఈజగమన్నా సురస్వప్నము వంటిదిరన్నా ॥విన॥

6. మర్కట శృంగము మరియన్నా కారుణ గుణప్రక్రమమన్నా
ఖరవీషాణముగనెన్నా వరుడు లేనిసతి చిరుతన్నా ॥విన॥

7. యండామావుల జలమన్నా వుందభోదని తెలియన్నా దండీ
గురువుల జేరన్నా అండా బాయకమండన్నా ॥విన॥

8. లేకతోచెలోకమురన్నా సికతాతైలన్యాయమురన్నా అకవరపు
రామయయన్నా లోకేశులులేరిదివిన్నా ॥విన॥

9. వాఖ్యత్రయములు గనుమన్నా నలుబదిత్రై మాత్రలురన్నా
మరువక సేవించినరన్నా మరల జన్మముకు రామన్నా ॥విన॥

10. సంకోజు వంశమురన్నా వంకలేని పదవిదిరన్నా మాతావిను
శాంతమన్నా పితాభిక్షమయచారన్నా ॥విను॥

11. రామచంద్రయాచారన్న ధర్మపత్ని సావిత్రన్న జన్మకర్మ
ములు లేవన్నా మర్మమెరిగినిను మానన్నా
॥వినరా॥వినరా॥శిష్య

## 14వ తత్వము

### భోదానందా పాలడుగు కమలయగారి విరచితము

1. ఇదివినరా నీకింగితముంటే మతిగనుమంతను మాయమురా
ఇహపరసౌఖ్యము కావలెనంటేసాహసశీలుడవై చవికొనరా ॥ఇ

2. చదువరనేననే చాలమధించిన బేధబుద్ధిగల మందమతీ ఆది
మూలము అఖండతేజము ఆనందము నిపుణనగలవా ॥ఇది॥

3. చిత్తమందు యిసుమంత అయినను చిద్విలాసునిది చిన్నతనము
ఇతరణము లేకను ఇంతవింతలని గంతులేసినను గనగలవ ॥ఇ

4. ధనము దండిగావున్నదియనియు దయనాకేలని తలపుకురా
తారుమారకును తబ్బిబ్బులు పడకురా చిరకాలము నీకు
స్థిరమటరా ॥ఇది॥

5. ధనము వున్నది తనయులు లేరని ధనవంతుడు దపించునురా
ధనము లేకను తనయులెందుకని ధనహీనుడు దపించునురా ॥ఇ



6. పేదరికమున పెనుభూతము ఒక్కటి బీదల పట్టుక లాగుచును
కాశీకి పోయిన ఖర్మము తప్పదు మర్మము లెలియద
మందమతీ ॥ఇది॥

7. ఇచ్చేటి వారికి ఇచ్చును దైవము హెచ్చుగా సంపద యెడలేక
సచ్చేన మీదట వచ్చేది ఏమిటి పిచ్చివాడ ఇదినిశ్చలము ॥ఇది

8. వుండిన రీతిగ వుండబోదుయిది యండమావులని యెరుగుమురా
చిలుక భూరుగూకాయలకును యాచించిన చందము జేయకురా ।ఇ

9. మేకపిల్లలు మేమేయనుచు మేత మెక్కుచు నుండునురా మేళ
ము వాటిని మెక్క జూచును మేదిని యది పెద్ధ తమాషరా ।ఇ

10. దేముడు గుళ్ళో కూర్చున్నాడని చూడబోదురిల చోధ్యముగా
వేడుక గాదుర్రా వెఱ్రివాడ యిదినీలో వెలియుముగనుగొనరా॥ఇ

11. ఓంకారమున రాముడు బుట్టెను రాముడే ఓంకారమురా
హాంకారంబున అది ఇదికాదనెమంకు గుణంబులు మానుమురా॥ఇ

12. ధరలో నేంద్రాగంటి హనుమయా దాసుల బోచిన ధన్యుడురా
చెన్నాకేశవా పురవాసుడు పాలడుగు కమలయాపలికెనురా ॥ఇ

## 15వ తత్వము

1. జగతిలో జననంబైనందులకు జై గురువనగదవే మనసా ॥జై॥
ఆత్మమధ్య జీవాత్మమధ్య నీవు అదినిగనగలవే మనసా ॥ఆ॥

2. గురుస్థానమునె గురుతు తెలుసుకొని గురిగలిగుండగదే
మనసా ॥గు॥ దృక్కుదృశ్యము ద్రష్ట సూన్యమని దృఢస్థితి
గనగలవే మనసా ॥దృ॥

3. సాధన చతుష్ట సంపత్తులను సాధించగవలెనే మనసా ॥సా॥
మతి గుదరగ గురుసేసజేసి వుపరతిని పొందగలవే మనసా ॥ప

4. ద్వైతాద్వైత విశిష్టద్వైతమనె మతముల బడబోకే మనసా॥మ
మత రహితంబగు మహాద్వైతమును మర్మంబెరుగగదే
మనసా ॥మ॥

5. అదివున్నది అదివున్నది బయలని అందించెను నీకుమనసా॥అ
యిదిలేనిది యిదిలేనిది యెరుకని వదిలించెను నిన్నుమనసా ॥ప

6. అచల గురుండగు ఆకవరపు రామాచార్యులు దెల్పె మనసా। ఆ
ధరణిలో సంకోజు రామచంద్రయా దారితెసుకొనెనే మనసా॥దా

## శ్రీమత్ నిర్మలానంద ఆకవరపు రామాచారిగారి విరచితము 16 కీర్తన

1. కాదంటావా బయలు లేదంటావా యెరుకాపోదంటావా మరి
యేమంటావు నిజము కాదంటావా. ॥కాదం॥

2. మిన్నుమన్నుకు మద్యా యెన్నోజన్మములెత్తి వున్నాదాన్ని
జాడాకన్నూగానక తిరిగి ॥కాదం॥

3. అండాపిండాండ బ్రహ్మాండంబునంతటా నిండీ పరిపూర్ణము
కుండాలి మీరిందీ. ॥కాదం॥

4. ఆత్మానాత్మలుగాక నేత్రామన్నదిలేక నేత్రామద్యము వెలిగే
సూత్రాతీ ముతరము. ॥కాదం॥

5. బట్టాబయులున యెరుక పుట్టానే లేదాని గుట్టుదెల్యముట్లా
బెట్టా సందూలేంది. ॥కాదం॥



6. వాదాబేధములేని వారిచే యెరుకాది లేదానీ తెలిసీతే
ద్వాదాశి అచలాము. ॥కాదం॥

7. క్షరమక్షరంబూలా సరణీ షోడసియెరుకా గురుకృపా
చేదీయ పరమూ అనంతాము. ॥కాదం॥

8. మతములు పార్టీలు మితమూలు యేర్పరచి గతిగానాలేకాను
మతిచెడి సత్యాము. ॥కాదం॥

9. ధరలో నేంద్రాగంటి వరహన్మాదార్యులా కరుణా వడసిన
ఆకవరపు రామయ మాట. ॥కాదం॥

## (అక్షయ పాత్ర కీర్తన)

1. అక్షయ పాత్రకు వచ్చినాము మమ్మాదరించరమ్మా మోక్ష
మిచ్చు మా కృష్ణదేశికులు మ్రొక్కి వేడరమ్మా ॥అక్ష॥

2 మూతులు ముక్కులు విరువక మాకిక ముష్టివేయరమ్మా ॥అ
ధాతలనుచు మీఅంతుగనుటకై దైవమంపేనమ్మా ॥అక్ష॥

3. హరిగురుద్యాన్నము ఆత్మలో జేసేటి హరిదాసులవమ్మా
పరమదయాళుత్వముతో వేసిన పిరికెడె చాలమ్మా ॥అక్ష॥

4. పండరినాధుడు పంపినందుకై పనిబడొస్తివమ్మా వుండిలేదనుచు
ఖండితమాడితే వుండవు శిరులమ్మా. ॥అక్ష॥

5. అప్పులవారము కాము అల్లుండ్లము హరిదాసులసుమ్మా
ఆడబిడ్డలతో ఆవులతో సరియైన వారమమ్మా ॥అక్ష॥

6. యెనుబది నాలుగులక్ష జీవులా యందుబుడితిమమ్మా కనికానక
చేసిన దోషము లొడిగట్టుకుంటిమమ్మా ॥అక్ష॥

7. పాచిపనులలోబడి చెడిపోతిమి భంగమిదేనమ్మా దాచిదాచి
ధనమెంత గూర్చినను ధరపాలేనమ్మా. ॥అక్ష॥

8. బలిదానమునిచ్చేను మూడడుగులు వినలేదటవమ్మా యిలయం
దున యశమొందిరి శ్రీహరి కరుణచేతనమ్మా. ॥అక్ష॥

9. రఘువంశంబున జనియించిన రఘురాజవీరుడమ్మా రాజ్యమిచ్చి
తన రమణినిచ్చెనట రమ్యదానమమ్మా. ॥అక్ష॥

10. వెన్నుబొక్కగా వలసిడదీశుని వేడేయింద్రుడమ్మా తిన్న
గనతడతి తీవ్రమృతుండై వెన్నునిచ్చెనమ్మా. ॥అక్ష॥

11. పూర్ణదానమును కర్ణుడిచ్చె తనుజేర్నవారికమ్మా పూర్ణులంద
రును పొగడుకొనగ మనముర్విలో వినమమ్మా ॥అక్ష॥

12. చారెడటుకులకు చేరికుచేలుని చింతదీర్చెనమ్మా వారి చరణ
సేవకు దాసులమై వస్తిమి వినరమ్మా. ॥అక్ష॥

13. యీ సమయమున మీ యింటికి వస్తిమి మోసపోకుడమ్మా
వ్యాసటపడి మా దోషముతెంచక బా లాడరమ్మా ॥అక్ష॥

14. ధాతలు తనుమనధన మర్పింతురు ఖ్యాతిదొరుకునమ్మా
ప్రేతలైన మనుజాతములందరు కూతలిడుదురమ్మా. ॥అక్ష॥

15. పూర్వమెవరికి పెట్టని దోషమే పట్టితెచ్చెనమ్మా పుర్విలో
మీకిపుడున్న ధనంబులో మోర్చియెవ్వరమ్మా ॥అక్ష॥

16. నరజన్మముదొరుకుట దుర్లభమిదె నమ్మివేడరమ్మా
గురుచరణామృత పానములేకను దొరకవు శిరులమ్మా ॥అక్ష॥



17. చూచి యేరువలేరు సుందరిమణులను పాచివెధవలమ్మా
ఆచకనీచపు మాటలాడెదరు చీచీయనరమ్మా ॥అక్ష॥

18. బిక్షాన్దేహిఅనివస్తిమి యింటికి బీదవారమమ్మా లక్షలవరకే
మిచ్చిన మీదు లక్ష్మితొలుగదమ్మా. ॥అక్ష॥

19. యింతింతను మాకివ్వమనుచు మేమడుగజాలమమ్మా యెంత
యిస్తేమీకంత పుణ్యము వెంటవచ్చునమ్మా. ॥అక్ష॥

20. యేమిచ్చిన పదియంతలెక్కువగయీశుడాసగునమ్మా పామర
బుద్ధితో యివ్వకున్నమరి పుట్టదు బువ్వమ్మా ॥అక్ష॥

21. రేపుమాపురమ్మని చెప్పితె రాముతెలియరమ్మా యీపట్లను
మీరేమిచ్చినగాని దీవించెదమమ్మా. ॥అక్ష॥

22. యిస్తేతక్కువగాదు యిమ్మడివచ్చును యిదినిశ్చయమమ్మా
వాస్తవమిదెకద చెలిమెనీరు మరితీస్తె వూరునమ్మా ॥అక్ష॥

23. ముట్టబోకుయిది మురికితొలుగద మూలమెరు
గదమ్మా కొట్టకొనకు బండెడు కట్టెలలో పెట్టికాల్తురమ్మా॥అ

24. చాటునేటున తిట్టకయిపుడే సాగనంపరమ్మా చాటున
తిట్టియు కోటులిచ్చినను చేరదుకీర్తమ్మా ॥అక్ష॥

25. భాగవతుల శ్రీకృష్ణదేశిక ప్రభునిగొలుతునమ్మా జాగులేక
మమురక్షించుటకై జననమొందిరమ్మా. ॥అక్ష॥

26. పీలుఖాన శంకరుడనె దాసుడు పేరుతెచ్చెనమ్మా బాలునివలె గని ప్రేమజేసి గురుభక్తి సలుపరమ్మా అక్షయపాత్రకు వచ్చినాము మమ్మాదరించ మోక్షమిచ్చు మాకృష్ణ దేశికులు మ్రొక్కి వేడరమ్మా.

....యితి సంపూర్ణం జై సద్గురు ప్రభు మహారాజుకు జై....



పరిపూర్ణభోధ ఉయ్యాలపాట శ్రీమత్ ఆకవరపు రామాచార్య ప్రియశిష్యుడు నిత్యానంద సంకోజు రామచంద్రాచారి అక్కా చెల్లెలు సంవాదము మావిరి వ్రాయునైనది.

## శ్రీ లపాట

1. శ్రీగురుని చరణములు ఉయ్యాలో సీఘ్రంబుగా మదిలో ॥ఉలా

2. జై రామగురునామ ॥ఉ॥ జై పరందామ ॥ఉ

3. రామ రామా రామా ॥ఉ॥ రామమము బ్రోవుమా ॥ఉ

4. పెద్దలా పాదములు ॥ఉ॥ వద్దిక తొమ్రొక్కి యిల ॥ఉ

5. కవి పండితుల గూడి ॥ఉ॥ సవినయంబుగ వేడి ॥ఉ

6. నాతల్లి తంద్రులను ॥ఉ॥ నాత్మలో తలచినే ॥ఉ

7. శ్రోతలానందరని ॥ఉ॥ ఖ్యాతిగావేడుకొని ॥ఉ

8. చెప్పబూనితి బోధ ॥ఉ॥ గొప్పవాడనుగాను ॥ఉ

9. తప్పున్న దిద్దుడని ॥ఉ॥ చెప్పిప్రార్ధించెదను ॥ఉ



10. అక్కచెల్లెండిట్లు ॥ఉ॥ పెక్కువాధించినటు ॥ఉ

11. గురుశిష్య సంవాద ॥ఉ॥ గురిగలిగి వినరండి ॥ఉ

12. అక్కరో ఓ యక్క ॥ఉ॥ మ్రొక్కి తెల్పెదమీకు ॥ఉ

13. నేబడ్డ పాట్లన్ని ॥ఉ॥ ఈ పాట్ల చెప్పెదను ॥ఉ

14. విగ్రహారాధనలు ॥ఉ॥ నిగ్రహంబుగ జేస్తి ॥ఉ

15. శాస్త్ర పురాణములు ॥ఉ॥ శోధించి చూస్తిమి ॥ఉ

16. కాశియాత్రలు అన్ని ॥ఉ॥ ఆశతో తిరిగితిమి ॥ఉ

17. కార్తీక స్నానములు ॥ఉ॥ పూర్తిగా వ్రతములు ॥ఉ

18. వక్కప్రొద్దులు నేను ॥ఉ॥ నిక్కమని వుంటినే ॥ఉ

19. ఆచారములు మళ్ళ ॥ఉ॥ నేజేసి చూచితిని ॥ఉ

20. తలలు బోడులుజేయ ॥ఉ॥ తలపులధికంబాయె ॥ఉ

21. ద్వైతాద్వైతంబులు ॥ఉ॥ విశిష్ట దైతములు ॥ఉ

22. నీమాలలో తిరిగి ॥ఉ॥ కామాదులుడుగకా ॥ఉ

23. యోగాలు చేయగా ॥ఉ॥ రోగాలు వచ్చెగా ॥ఉ

24. హంకార గుణములు ॥ఉ॥ అధికంగా వృద్ధాయె ॥ఉ

25. నిన్ను తెలియగలేక ॥ఉ॥ యిన్ని ఖాదలు బడితి ॥వు

26. అక్కరో తెల్పనే ॥వు॥ నిక్కమైన పదవి ॥వు

27. దేముడెచ్చట నుండె ॥వు॥ భావించి చెప్పుమా ॥వు

28. చెల్లెలో తెల్పెద ॥వు॥ కల్లలేని బోధ ॥వు

29. పరిపూర్ణ బోధను ॥వు॥ పరగ వినవే చెల్లె ॥వు

30. లక్షణాయుతముగా ॥వు॥ దీక్షతో వినవమ్మ ॥వు

31. మానాభిమానములు ॥వు॥ మానుకొని వినుచెల్లె ॥వు

32. మానవ జన్మమున ॥వు॥ కానవలె దేముణ్ణి ॥వు

33. ఈ జన్మబోయితే వు యే జన్మమునగాదు ॥వు

34. యిదిగో తెల్పెదనిట్లు పు పమగురు వినేటట్టు పు
35. గురుని పారంపరము పు గురిగల్గి వినవమ్మ పు
36. బృహద్వాశిష్టము పు బ్రహ్మ విద్యాగనుము పు
37. ఓంకార పీఠమున పు శ్రీమన్నారాయణుడు పు
38. రవి యాజ్ఞవల్క్యుయు పు సవినయంబుగ తెల్పె పు
39. జనకశుకసాంధిపులు పు కనిన భావమునెల్ల పు
40. శ్రీకృష్ణపరమాత్మ పు అర్జునుద్ధవులెరిగి పు
41. శ్రీధరస్వాములు పు శివరామ దీక్షితులు పు
42. అప్ప బ్రహ్మగురుడు పు సీతరామ ప్రభులు పు
43. భాగవత కృష్ణుండు పు వేగ పిల్ఖాన లక్షణులు పు
44. కొమరగిరి లక్షణులు పు హన్మద్గురునికి తెల్పె పు
45. లంకరంగామాంబా పు ఆకవరపు రామప్రభులు పు
46. రామచంద్రదాదాపు పు రమ్యముగ పొందెనే పు
47. యిట్టి సద్బోధను పు గట్టిగా వినుచెల్లె పు
48. గురుని కన్నవేరే పు హరుడెచట లేడమ్మ పు
49. సాక్షాత్ బ్రహ్మము పు దీక్షతో వినుచెల్లె పు
50. గురుని నమ్మినవారు పు పరము జెందెదరమ్మ పు
51. నాల్గు శుశ్రూషణలు పు నాల్గు సాధనలెరిగి పు
52. సాంఖ్యము తారకము పు మరియు అమనస్కము పు
53. పరిపూర్ణము యెరిగి పు యెరిగి యెరుకను విడుము పు
54. అక్కరో వోయక్క పు మ్రొక్కి వేడెదనమ్మ పు
55. పరిపూర్ణ బ్రహ్మము పు పరుగనెట్టుల నుండె పు
56. యెరుకెట్లు బుట్టెను పు యెరుక విడుచునదెట్లు పు
57. యిట్టి బోధానాకు పు నట్టులేకను తెల్పు పు



58. బుద్ధి నిలకడ జేసి ||ఉ|| శ్రద్ధగా వినుచెల్లె ||ఉ
59. యెరుక ఉత్పత్తినీ ||ఉ|| యెరుగవే తెల్పెదా ||ఉ
60. నీటిలో బుద్బుదము ||ఉ|| మేటిగా తోచినటు ||ఉ
61. యెండమావుల జలము ||ఉ|| నిండుగా వున్నట్లు ||ఉ
62. వంధ్య పుత్రుడు బుట్టి ||ఉ|| సంధ్య వార్చినయట్లు ||ఉ
63. నారికేళములోన ||ఉ|| నీరు వచ్చినరీతి ||ఉ
64. గగనంబునను మబ్బు ||ఉ|| నగరములు తోచినటు ||ఉ
65. ముకరమున బింబము ||ఉ|| ప్రకటముగా ఉన్నట్లు ||ఉ
66. చెల్లె యెరుకను తెలియు ||ఉ|| పుశ్శక్కిని వునేను ||ఉ
67. చెల్లని పత్రము ||ఉ|| చెల్లించినట్లప్పను ||ఉ
68. కలలోన జగములు ||ఉ|| నిజముగా తోచేనే ||ఉ
69. మేలుకొని చూచితె ||ఉ|| యేలోకములులేవు ||ఉ
70. యిట్టి తెలివీనీవు ||ఉ|| వట్టి యెరుకని తెలియు ||ఉ
71. నీకు మూలములేదు ||ఉ|| నిక్కమును యెరిగితే ||ఉ
72. అచల బ్రహ్మముకన్న ||ఉ|| అసలు లేదికవిన్న ||ఉ
73. పుట్టుగిట్టులులేని ||ఉ|| బట్ట బయలెరుగవలె ||ఉ
74. రాతిలో నూతిలో ||ఉ|| గోతులో గొంతులో ||ఉ
75. చెట్లలో గుట్లలో ||ఉ|| పుట్టలో పొట్టలో ||ఉ
76. యెరుపు తెలుపు నలుపు ||ఉ|| యే రం పలూగాక ||ఉ
77. అగ్నికీకాలకా ||ఉ|| వానకూ తడియకా ||ఉ
78. నాల్గు దిక్కులుమూల ||ఉ|| నడుమ క్రిందామీద ||ఉ
79. ముల్లు మోపుటకైన ||ఉ|| సందులేకున్నదే ||ఉ
80. అంతయింతనితెల్ప ||ఉ|| అంతులేదే చెల్లె ||ఉ
81. యిట్టి బ్రహ్మంబును ||ఉ|| పట్టుతో నెరిగితే ||ఉ

82. భ్రాంతిలేకనుపోవు ॥పు॥ గతులు జన్మలులేవు ॥పు
83. గుట్టు గురునిచెతెల్య ॥పు॥ పట్టిదే యీ యెరుక ॥పు
84. పుట్టపై గొట్టగా ॥పు॥ గిట్టునా మరగంబు ॥పు
85. పాదు పెకలించియు ॥పు॥ పడిగపై గొట్టవలె ॥పు
86. యెరుక కూకుడువేరు ॥పు॥ యెరిగి త్రవ్వగవలయు ॥పు
87. అక్కరో ఓయక్క ॥పు॥ చక్కనీ ఈబోధ ॥పు
88. నా పూర్వ పుణ్యమున ॥పు॥ యిపుడనే వింటినే ॥పు
89. గురు రుణంబునునీవు ॥పు॥ మరితీర్చవే చెల్లె ॥పు
90. తను మనోధనమునూ ॥పు॥ మన్ననతో యివ్వవే ॥పు
91. చెల్లెనీవిచ్చినది ॥పు॥ మళ్ళిముట్టకు దీన్ని ॥పు
92. గురునిపాదములాన ॥పు॥ మరచి పోరాదమ్మ ॥పు
93. ఈ స్థితిని పొందటము ॥పు॥ దుస్తురము వినుచెల్లె ।పు
94. పొందినావారికి ।పు। అందినట్టే పరము ।పు
95. రవిపేట తాలూక ।పు। తుమ్మలపల్లి గ్రామము ।పు
96. సంకోజు వంశమున ।పు। శంకలేకను వినుడి ।పు
97. మాత శాంతమ్మకు ।పు। పిత భిక్షమయచారి ।పు
98. పుడమిలో పుదయించి ।పు। నుడివితిని ఈపాట ।పు
99. సావిత్రమాంబనూ ।పు। ధర్మపత్నిగానెంచి ।పు
100. రామగురునీ కరుణ ।పు। నీమముతో పొందియు ।పు
101. లంకారంగామాంబ ।పు। పొంకముగ తెల్పగా ।పు
102. ఖమ్మం పట్టణభక్తులు ।పు। కామాదులుడిగిరీ ।పు
103. యేస్లాటు వారైన ।పు। ఈ పాట జగుదువగా ।పు
104. చదివినా వ్రాసినా ।పు। పదిలముగా పరమౌను ।పు
105. రామచంద్రా దాసు ।పు। రక్షణలు పొందెనే ।పు



106. జనన మరణ భ్రాంతి ।పు। గగనముగానేగునే ।పు
107. శ్రద్ధగా చదివితే ।పు। బద్ధత్వములుబాయు ।పు
108. స్వామిగురుడూ మెచ్చి ।పు। కామితార్థములిచ్చు ।పు
109. మన పెద్దలందరిని ।పు। వినయముతో వేడుకొని ।పు
110. మంగళాహారతులు ।పు। సద్గురునికిచ్చెదము ।పు
111. వంశపారంపరుల ।పు। వరుసగా వేడుకొని ।పు
112. కర్పూర హారతులు ।పు। ఓర్పుతో యిచ్చెదము ।పు
113. మంగళం మంగళం ।పు। మంగళం గురుదేవ ।పు
114. మంగళ ప్రదముగా ।పు। మళ్ళిరాకుండగా ।పు
115. అక్కరో వోయక్క ।పు। ఒక్కటై వెళ్లదము ।పు
116. జయరామ గురుదేవ ।పు। జయమమ్మ బ్రోపుమా ।పు

జై సద్గురు ప్రభు మహారాజుకు జై



## గురుఆజ్ఞ దప్పి నటించినవారిని గురించి చెప్పిన పద్యములు

సీ॥ గురువాజ్ఞ లేనిదే గురువు తానై చాల శిష్యులకు భోధించి చెడు
టవినుడి ఇహపరంబులు లేకనెరుక విడిచియు బ్రహ్మరాక్షసియై
మహారణ్యమందు పుట్టి దుఃఖింపుచు పొలుపార నిర్జనస్థాన
మందునబడి తల్లడించు యిటువంటి గురుజేరి యెవరైనను
పదేశమొందిన మోక్షంబు జెందలేరు యనుచుగాలబు సద్గురుం
డానతిచ్చే సకల వేదాంతశాస్త్రముల్ సమ్మతముగ వినియుకని
కాల్వకోటప్ప విమలమతిని సీసపద్యంబు రచియించె భాసురముగా

గీ॥ గురుని దిఃఖరించి గుణహీనుడై పోయి శిష్యజనము గూర్చి
చెలగిబోధ సేయువాని మోమురోయక జూచిన దోషమనిరి
బుధులు తోయజాక్షా.

ఉ॥ దొంగతనంబు చేత గురుదూషకుడై వుపదేశమిచ్చితా భంగ
ముజేసి మానపుల బ్రష్టుడు సద్గురుజేరకెప్పుడున్వుపొ్వంగుచు
సూకరంబుగతి భూమి చరింపుచునుండు నట్టిదుస్సంగుని గన్న
తక్షణమే స్నానము జేయక నుండరాదు. సస్సంగుల భావమిట్టి
దని సద్గురు గాలబు బల్కెనిద్ధరన్.

గీ॥ గురుపాతకుడగు వానిని గురుపుత్రుడు గన్నయపుడె గురువరు
కరుణన్ పరగగ ఆత్మస్థానము భరనిబుసలపంగవలయు
ధన్యులు మెచ్చన్.

గీ॥ అవని లోపల శ్రీకృష్ణుడర్జుననకు అఖిల పరిపూర్ణమున మీ
ఆత్మతీర్ధ మందుమునుగుటయే స్నానంబు మరియు పాపనాశ
నంబని బోధించెనద్భుతముగా.

సీ॥ శ్రీగురుమూర్తిని సృష్టిలోపల గాంచి వినయంబు భయభక్తి
విస్తరిల్ల జేసియు కొన్నాళ్ళు చెలుమెప్పన ద్వైత మార్గసాధన
ములు మదినెరింగి గర్వించియటమీద ఘనగురుమూర్తిని కన్న
లగనక దుష్కర్ముడచు కాయంబు సతమని ప్రాయమెల్లను
పుత్రదారాదులకు తానుదారబోసి మృతము నొందిన వెనుక
దుర్గతిని నేగు గానగురుకుల వాసంబు ఘట్టిగాను పూనివర్తింప
కున్నస్త్రీ పురుషులకును నరకమని పల్కెగాంబు గురువరుండూ





౦౧౦ ౦ఓం౦ ౦౧౦

## గురుఆజ్ఞ ప్రకారము ఉపదేశించిన వారిని గురించి చెప్పిన పద్యములు

గీ॥ శాస్త్రపరిచయంబు చాలగల్గియు శాంతచిత్తుడగుచు గురుని
సేవద్వాదశాబ్ధి తరియులెస్స సలిపిన శిష్యుని గురుని జేయ
దలచి గురువరుండూ.

సీ॥ శ్రీరస్తు శుభమస్తు శ్రీ దిగ్విజయమస్తు యని సద్గురు స్వామి
ఘనముగాను దీవించి శిష్యుని భావించి యధికారమూహించి
యానందమూర్తియపుడు తనహస్తలిఖితంబు దనరు పత్రిక
గాను వ్రాసి సాక్షులబెట్టి పప్పగించి బ్రహ్మనిష్టుండవై బ్రహ్మ
స్వరూపంబు నుపదేశమిమ్మని నుర్విలోన శెలవు యిచ్చిన
పిమ్మట శిష్యవరుడు ముక్తిగోరిన వారలకు మోదమునను
కారణముజేసి తనగురు కార్యములను బూని వర్తింపుచును
జనతపూజ్యుడగచూ.

గీ॥ కాల్వకోటప్ప ఈరీతిగాల బాజ్ఞ తప్పకనుసేయు పద్యముల్
ధాత్రిలోను మూడువిధముల వర్తించు మోదములర కారణా
చార్యులను జేరి గాంచవలయూ.



౦౧౦ ౦ఓం ౦౧౦

## దశావతార మేలుకొలుపు

1. జీవా మేలుకో మేలుకొనవేమయా జీవా మేలుగన గురుజేరలేవా
మూలమూ లేవట్టి కాయము కీలుదెలియటకూ జీవా ।మేలుకో।

2. తల్లి గర్భము వెడలి యిలకలినీళ్ళబడి మలమూత్రములలో
పొర్ల లేకను మత్స్యమూగతి తల్లడిల్లితివి జీవా. ॥మేలు॥

3. కొన్నిమాసములైన పిమ్మట తన్నుకొనుచు బోర్లబండూకున్న
కరచరణంబులాడుచూ కూర్మవిధమీవూ జీవా. ॥మేలు॥

4. అంబగళ్ళాడుచును పెద్దల వెంబడించి రోధనంబున డింభకుడ
బురదంటితివి వరహంబు రీతిగనూ జీవా. ॥మేలు॥

5. తప్పటడుగులు వేయుచూను కనురెప్ప శౌప్పాళించి నెరులూ
కప్పుకొని నరసింహ రూపము గానవచ్చితివి జీవా ॥మేలు॥

6. ఇంక కొంతకాలమునకే వంకనెవ్వరు యేమిదిన్నను శంకలే
కను వామనుడవై చెయ్యి సాచితివి జీవా. ॥మేలు॥

7. పదియూ రెండూవర్షములకూ పదుగురు సరిబాలురాతో యెదిరి
భార్గవ రాముడావై వెలసితివిధాత్రీ జీవా. ॥మేలు॥

8. ప్రేమతోడను మాతపితరులు పెండ్లిజేయ దలంచినందున రామ
యంచు వివాహమాడి శ్రీరామువైనావూ జీవా. ॥మేలు॥

9. యవ్వనంబున కామకుడవై పువ్వు బోణులతోటి సరసము
నవ్వులాటల గోపికలతో నాడు కృష్ణుడవూ జీవా. ॥మేలు॥



10. భార్యతనయులు భాతృలనజులు దైర్యమున కౌమారదశను
భారమన కనునీదు ఖర్మకు బద్ధుడౌ బుద్ధుడవూ జీవా ॥మేలు॥

11. వడలు వణుకుచు మాటతడబడ వారువీరనె వారధిక్యము
కడువడీయుగ ధర్మదెల్పిన కలికిమూర్తివిగా జీవా ॥మేలు॥

12. దశయవతారంబులుమనీ దశలు నాలుగు మెనులకుపై అసలు
గానక మొద్దునిద్రను అణగియున్నావూ జీవా. ॥మేలు॥

13. కాయమే స్థిరమంచు భ్రాంతిచె గడిపితివి కాలంబువృధగా
బాయకను గురుసేవజేయు వుపాయమెరుగగదే జీవా. ॥మేలు॥

14. అచల గురుడగు అర్కుడిప్పుడు ప్రచుర పరుచనువు దయ
మయ్యెను సుచరితులు షాల్కొనియు ద్వాదశి సూటి గన్నారు
జీవా. ॥మేలు॥

15. పుట్టిగిట్టుచునుండె మాయ గుట్టుదెల్యుము షోడషాక్షరీ చిట్ట
చివరకు పుట్టిముణుగును బట్టబయలెరుగూ జీవా. ॥మేలు॥

16. ధీరనేంద్రాగంటి హనుమద్దేశికులు మెల్కొపుచుండగ ధారుణీ
ఆకవరపు రామాదాసు మెల్కొనుమూ జీవా. ॥మేలు॥

## మేలుకొలుపు

1. మోసమాయెను జీవి చూడగ మోహపాశములధికమాయెను.
గాసి జెందగ జేనెనీగతి కర్మమె మందూ జీవా ॥మేలు॥

2. కల్పశతముల కన్నమిక్కిలి కాలమాయెను తిరిగి చూడగ
అల్పసుఖమనే కలలొమురుయుచు అడుచున్నావు జీవా ।మేలు।

3. కోటి జన్మములెత్తియును శతకోటి దుఃఖముఃనుభవించియు
నాటి మాటలు తలచుకుంటివే నాటునీమదికీ జీవా ॥మేలు॥

4. యిరువదొక వెయ్యార్వు నూరులు జరుగు హంసలు తరుగు
నాయువు అరిహరాదులు వచ్చినిలిచిన ఆగదీ తనువూ జీవా।మె

5. లేనిపోని దుఃఖ జాలములోనబడి చెడిపోవుటెందుకు మాన అవ
మానములనే నీ మమత విడలేవూ జీవా. ॥మేలు॥

6. నిజగురుఁడగు సూర్యుడిప్పుడు నిజముగానుదయించె చూడుము
త్రిజగముల వారంత మెల్కొని తెలివి గన్నారు జీవా॥మేలు॥

7. బట్టబయలను గురుడు సూచన నట్టులేకను గట్టితనమున పట్టు
వీడక గురుని మరువక దిట్టమైపోవే జీవా. ॥మేలు॥

8. మాయతనువై మాయతానై మాయపనుఃను జేయుచును మరి
మాయ తను మర్మంబు గనగనె. మాయమైపోవున్ ॥జీవా॥మె

9. ద్వాదశీ షోడశీయనే జలధారకరణముఃందు సోకినబాధలన్నియు
దొలగి నీవిక భ్రాంతులొందిలేవు జీవా. ॥మేలు॥

10. భాగవత శ్రీకృష్ణదేశిక ప్రభువరుండిటురానె వచ్చెను.
వేగతను మనోఘనంబులు వీడి శరణనవే జీవా ॥మేలు॥

11. ఫీల్ఖానా శంకరుడనేపిలిచిగురు వరువరునేలినాడట మూలమూ
లేనట్టి తనువును ముంచివేశిరటా. జీవా. ॥మేలు॥





ఓం ఓం ఓం

## ఋణానుబంధ మేలుకొలుపు

1 మేలుకో హంసా మేలుకో మేలుకొనవే పరమహంసా మేల్క
గనుకొని ఘటము లోపల మేటియగు సహస్రారమందున
సూటిదెలియగదే. ॥హంసా॥

2 శ్లో:- ఋణాను బంధరూపేణా పశుపత్ని సూతాలయః ఋణ
క్షయే వియుజ్యంతి కాతత్రః పరివేదనా.

తా॥ రుణము వున్నావరకె బంధము ఘనముగా పశుపత్ని సుతులు
రుణము తీరిన సతులు సుతులు క్షణము నిల్వరుగా ॥హంసా॥

3. శ్లో:- మాతానాస్తి పితానాస్తి నాస్తీ బంధుసహోదరః అర్థం
నాస్తి గృహంనాస్తి తస్మాత్ జాగ్రతో జాగ్రతాః

తా॥ తల్లి తండ్రులు బంధు సోదరు తనువు ధనగృహముండ
బోదని తెలివినొంది నిద్రనిడి జాగ్రతొందిగదే ॥హంసా॥

4. శ్లో:- కామక్రోదశ్చలో భశ్చదేహేతిష్టంతితస్కరాః జ్ఞాన
రత్నాపహారాయ తస్మాత్ జాగ్రతో జాగ్రతః

తా॥ కామక్రోదార్గురు దొంగలు కాచుకొని కాపాడుచుండిరి
త్రిపుటి పెట్టెలో జ్ఞానరత్నమునపహరింపెదరూ. ॥హంసా॥

5. శ్లో:- జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః
సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రతో జాగ్రతాః

తా॥ పుట్టె దుఃఖము పెరిగె దుఃఖము చిట్టచివరకు చచ్చె దుఃఖం సంసార సాగరమే దుఃఖము హింస నొందకుమా ॥హంసా॥

6. శ్లో:- ఆశయాబద్ధతేలోకే కర్మణాబహుచింతయా ఆయుఃక్షీణం నజానాతి తస్మాత్ జాగ్రతో జాగ్రతః

తా॥ ఆశ కర్మలనేక చింతలు పాశబంధములోకమంతను ఆయు పు క్షీణించి పోవును. అంతర్ జాగ్రతొందగదే ॥హంసా॥

7. శ్లో:- ఆకవరపు రామాచార్యం ప్రియశిష్యం పూర్ణబోధకం సంకోజు రామచంద్రాచార్యం నిత్యానందం గురుం భజే

తా॥ ఆకవరపు రామప్రభుడు జోకతో మేల్ కొల్పుచుండగ సంకోజు రామచంద్రదాసుడు డంకవేసెనుగా. ॥హంసా॥ దారనగరా పట్నమందున ధర్ముడనె మహదాసుడుండెను సంగుడను సత్పుత్రుడిలలో సద్భావమొందెనుగా. ॥హంసా॥

## నిశ్చింత వారి దుఃఖ నివృత్తి మేలుకొలుపు

1. మేలుకో ఓ శిష్యతిలకా మేలుకో సద్భక్త కొలికీ మేలుకో మెప్పులకుప్పా మేలుకోనాన్న రత్నాల కొండా. ॥మేలు॥

1. శ్లో:- యావత్కాలంకరే కర్మా తావతిష్టం తిజంతవః తస్మీన్ క్షీణేవినశ్యంతి కాతత్రః పరివేదనా

తా॥ యెంతకాలము కర్మలుండునో అంతకాలమే జీవులుందురు. కర్మఅనుభవమైన నొక్కరు కానరారుసుమా యిమ్మహిలో ఈకర్మ జీవులు కర్మలోబడి రాకపోకల కదులుచుండగ నీవు యీగతి కాంక్షగుందుమా రత్నాలకొండా. ॥మేలు॥



2 శ్లో॥ ప్రాపయామిమ లేళ్లంతుకర్మణై కర్తదేహినః కర్మక్షయే వియుజ్యంతి కాతత్రః పరివేదన.

తా॥ దేహధారులు ప్రాప్తకర్మల దివ్యముగ చేకురిచి యటుపై కర్మక్షయమున కర్తలందరు గతుల మారెదరూ కర్మజీవులు జన్మవీడగ కామకుడవై రారికొరకిటులదరి బెదరియు చెదరినీమదివృధభ్రమించకుమా బంగారుబాబు. ॥మేలుకో॥

3. శ్లో॥ రుణానుబంధరూపేణా పశుపత్ని సుతాయలః రుణక్షయేవి యుజ్యంతి కాతత్రః పరివేదనా.

తా॥ రుణమనేయనుభంద సూత్రము ఘనముగా బంధించి జీవుల పశుల పతులని సతులు సుతులని వెతల బెట్టునుగా రుణము తీరిన వెంటనే యవి తను మనోరథమెంతయున్నను అణిగి పోవును మణగజేయను మదిని గుందకుమా ముత్యాల సరమూ. ॥మేలు॥

4. శ్లో:- పక్వాని తరుపర్ణాని పతంతిక్రమశోయథా తద్దైవజం తవః కాలేకాతత్రః పరివేదనా.

తా॥ పండుటాకులు చెట్టురాలగ పచ్చియాకులు ప్రకాశించును. పచ్చియాకులు పండొకప్పుడు పకపకల బడునూ పట్టుగా ఈ జీవులన్నియు పండుటాకుల చందమేనని పండుబారిన వాడవై వగగుందనేలనయా చిన్నారితండ్రి మేలుకో మేలుకో

5. శ్లో:- ఇదం కాష్టం మిదం కాష్టం నద్యాంమహతి సంగమం సంయోశ్చ వియోగాశ్చ కాతత్రః పరివేదనా

తా॥ యేటబడియొక కట్టె మరిశెలయేటబడి మరొకట్టె వచ్చుచు నేటుగా నడియేట నొగటిక నడుమనొకకొంతా సూటిగా మీరెం

దొకప్పుడు వాటికవి వేరయ్యి వేగమ్మే యేటి కోనల నేగుమన
మటు లేగవలెపేలా బంగారు బంతీ ॥మేలు॥

6. శ్లో:- యేకవృక్ష సమారూడా నానాజాతి విహంగమా ప్రభావే
విధశో యాంతి కాతత్రః పరివేదనా.

తా॥ ప్రొద్దుగ్రుంకిన తోడనే బహుపులుగు లొచ్చొక చెట్టుగూడును
ప్రొద్దు పొడుపుగ పోవునట్లైన పులుగులన్నియునాయదైమాదిరి
కర్మజీవులు వృద్ధిక్షయముల నొందుచుందురు మద్దిగా ఈమాయ
భ్రాంతిలో మరిగి వగగొనకూ రత్నాలకొండా ॥మెలు॥

7. శ్లో:- మృణ్మయానిచ బాండాని బహూనివి విదానిచ భిన్న
బాండం పరిత్యజ్య కాతత్రః పరివేదనా

తా॥ మట్టి చట్టుల తట్టనిడుకొని మఋవవక తటుబోవుచుండగ
కొట్టుకొని యే కుండబగులగనట్టె పడవేయా దిట్టముగ మిగి
లున్న కుండల తట్టనాపగై కొనుచు పోవును నష్టలేమి జగతి
జనులది కట్టుకథ వినరా బంగారు భరిణా ॥మెలు॥

8. శ్లో:- మాతాయది విషంద ద్యాత్ పితావిక్రయతే విజం రాజా
హారతి సర్వస్వం కాత్రత్రః పరివేదనా

తా॥ తల్లి విషమిడు తండ్రియమ్ముమనుతగవుసరిరాజడుగునంతయు
తల్లడిల్లక తద్యమునుగని దైర్యముగ నుండూ యిల్లువాకిలి
కల్లబాందవ్యు లెల్ల దేశికులుల్లమునగని కల్లిబొల్లి వగలబడి
యిలతల్లడిల్లకయా రత్నాలకొండా ॥మెలు॥

9. శ్లో:- పుడమిలో ఆచంట పురిలో పురుషవరుడా చార్యశేఖరు
డరయభో ధానంద రాముడు అచలగురుడుండే తడవు శాయక
జనని లెమ్మని వడిగబడియము ఋడుపు మాపెను గుడపు
బొమ్మె గురునిగను జడజలధి జగమందూ ముత్యాల సరమా
॥మెలు॥ మెలుకో ఓ శిష్యతిలకా



ఓగం ఓఁం ఓగం

## జెండా పాట

జెండ చేతబట్టుమా బ్రహ్మండ మీవాలా వలున్నదిగాంచుమా ॥జెం

1. జెండా చేతబట్టి అచలము అండబాయక నిండుమనసుతో దండి
గురువుల సేవజేసియు మొండిమాయను చెండిపేసియు ॥జెం॥

2. వుండిలేకాపోయె జగము వుండున నిబ్రమ జెండనేల యండ
మావుల రీతిగాను వుండిలేకాపోయె ఆత్మ ॥జెం॥

3. ఓంటుకూ వలపాల దాపలఅంటనట్టి బిందురూపము జంటగా
భావించి చూచిన తంటతీరును లేని యెరుక ॥జెం॥

4. వాదబేధము లేనిదది మతవాదులకుపై అతిగనున్నది బోధ
నెరిగిన వారలకు యమబాధలను విడనాడ జేసేటి ॥జెం॥

5. అజహరి శివులాది సురులు నారదాది మహామునీంద్రులు నిజము
నెరిగియు మరువకుండగ జగతిలో స్థాపింపజేసిన ॥జెం॥

6. జనకశుక సాంధీప కృష్ణులు అనుభమున అర్జునులు యుద్ధవు
శ్రీధరులు శివరామ దీక్షితు సీతరామా ప్రభువులెత్తిన ॥జెం॥

7. భాగవత శ్రీకృష్ణ ప్రభువులు ఫీల్ఖానా లక్ష్మణార్యులు కామర
గిరి శ్రీలక్ష్మణ ప్రభు కోరినిల్పిన అచల జెండా ॥జెం॥

8. హనుమదార్యుల కరుణతోడ ఆకవరపు రామగురుడు లంక
రంగామాంబ శ్రీగురు శంక లేకను స్థిరపరచిన ॥జెం॥

9. పొట్లపహాడు నగరమందున పట్టువదలక భక్తులందరు గట్టిగా
శివరామ దీక్షిత అచలాశ్రమ మందు నిలిపిన ॥జెం॥

10. పొంక ముగమతములను మీరి వంక లేని అచలబోధ సంకోజు
రామచంద్రదాసు జంకువదలి నెలకొల్పిన ॥జెం॥

## జండా పాట

1. శివరామదీక్షితుల జండా యిది భవనాశములులేని పరిపూర్ణ
జండా ॥శివ॥

2. దివ్యముగా శివరామ దీక్షితుల జండాను సవ్యంబుగా యెత్తి
చాటుదామూ రాండి ॥శివ॥

3. ఓంకారమునకు పైనున్న సద్గురుమూర్తి హాంకార మమకార
మణగ ద్రొక్కమటన్న ॥శివ॥

4. వొంటికిరువై పులన్ దంటుబిందుపురీతి కంటె బయలున యెరుక
తంటదీరూనన్న ॥శివ॥

5. తాళ్లామృదంగాది ద్వనులనూరేగించి మేళ్ళాలతో జండమే
దినీ నిలుపుదము ॥శివ॥

6. భక్తులందారాము భజనలు జేతాము యుక్తిచే బయలెరిగి వూహ
నొదులుదాము ॥శివ॥

7. శివరామ దీక్షితుల శిష్యుడప్పయ బంటు సీతారామస్వామి
ఖ్యాతిగా స్థాపించె ॥శివ॥

8. భాగవతులా కృష్ణయోగిశ్రీ ఫిల్లానత్యాగి లక్ష్మణులీ పతాకం
బునెలకొల్పె ॥శివ॥

9. జయజేయ నాధాలు జయభేరి మోదాలు రాజగురు మార్గమున
రంజిల్లు చుండాలి ॥శివ॥

10. దేశికుడు హనుమయ్య దాసుడు రామయ్య చేసీనాడీ కృతిని
జై జేలు కొట్టండి ॥శివ॥



౦౧౦ ౦ఓం ౦౧౦

## మంగళ హారతి

1. నిర్వికారాయ సకల నిత్యముక్తి దాయకాయ నిర్గుణాయ నిర్మ
లాయ నిత్యమంగళం ॥ని॥

2. సగుణ నిర్గుణ రహితాయ సంకల్ప వర్జితాయ సర్వ సాక్షీతు
నాకు సత్య మంగళం ॥ని॥

3. సత్తుచిత్తు సమసిపాయె శతృసంహారణాయ వత్తి తేనిదీపము
నీకిత్తు మంగళం ॥ని॥

4. చేష్టలన్ని ఉడిగిపాయె చేసేదేమి లేకపాయె శేషమ్మ మనసు
నీలో చేరేమంగళం ॥ని॥

5. పరిపూర్ణాయ సకల భవ్యదివ్య రూపాయ పరశురామాయ
సీతరామ మంగళం ॥ని॥

## మంగళ హారతి

మంగళా నీరాజనంబిదిగో మద్గురుమూర్తి మంగళా హారాతి
గైకొనుమా సద్గురు మూర్తి

1. అంగణా మణులెల్లగూడి బంగారు పళ్ళెరము తోడా సంగరహి
తము జేసి యాడ బంగమొందెటి భ్రాంతివీడ ॥మంగళా॥

2. తల్లి, తండ్రివి, ధొరవు, ధాతవు, వల్లభుడవని, వరప్రసాదని
యుల్ల మందున నమ్మువారిని యుల్లవేళ్ళలా బ్రోచినావని ॥మం॥

3. బుద్ధికతికే బోధజెప్పియు బద్ధత్వము బారద్రోలియు వద్దనున్నా
ప్రజ్ఞలన్నియు వదలజేసిన నిజగురు జయ ॥మం॥

4. చిల్లరా బోధాలనన్నిటి వల్లకుండగ జేసినావిటు కల్లలే నీతిర
ముజూపియు మల్లిరానీ మరుగు తెలిపిన ॥మం॥

5. ముల్లుమోపను సందులేకను యల్ల లోకము నిండినాదని మల్లి
మల్లి మరువ వద్దని తెల్లమిగమీవల్ల వింటిని ॥మం॥

6. చెప్పిచూపుట కలవిగానిది వొప్పుటకు నచ్చేమిలేనిది రెప్ప
పాటులో సూచనైనది. యిప్పటికి తమకృపను గనినది ॥మం॥

7. సృష్టిస్థితి లయములను తెల్పి దృష్టి దృశ్యము భ్రష్టమాపి బట్ట
బయలనె గుట్టుజూపి చిట్టచివరకు యెరుకమాసి ॥మం॥

8. కలలో దోచిన శరీరంబులు యిలలో జూడ తరము గాదని
కలకు కలియుగమునకు భేదము కలుగదనినా సద్గురునకు ॥మం॥

9. వాసిగా బృహద్వాశిష్టము వంశపారం పర్యులకునూ దేశదేశము
నందు నుండిన దేశికులకూ జయతు జయా ॥మం॥

10. స్థిరముగను తుమ్మాలపల్లిలో ధరను శ్రీశివరామ దీక్షితగురు
పీఠము నందువెలసిన మరియు రామాచారికి జయ ॥మం॥

11. సంకోజు వంశమందుగా శంకసమ్మతి పొందినట్టి యింక రామా
చంద్రదాసు జంకువదలి శరణు శరణనె ॥మం॥





౦౧౦ ౦ఓం ౦౧౦

## వంశపారంపర్య మంగళ హారతి

1. శ్రీమించు పరిపూర్ణ గురుసాంప్రదాయక ప్రేమశ్రీ ఓంకార
పీఠమునకూ శ్రీమన్నారాయణ స్వామి ప్రియశిష్యుడౌ భూమా
నంద సూర్యభగవానుకూ ॥జయమంగళం నిత్యశుభ మంగళం॥
జయతు జయమంగళం మహోత్సవ మంగళం.

2. అహంబ్రహ్మాస్మియను సోహంబునణిగించి అహంకార రహి
తుడగు యాజ్ఞవల్క్యకినీ దేహిదేహములనే తెరతీయునట్టి విదే
హరారాజ గురు జనకునకునూ జయ జయాజయ. ॥మం॥

3. అకట వికటములేని అకళంకగురు బోధ ప్రకటపరిచిన యట్టి
శుకయోగికీ అకట బయలుకు తప్ప యికయేమి లేదనుచు
సకలంబు మాయన్న సాధింపునకూ. ॥జయ॥

4. బట్టబయలును జూపి వట్టిదియెరుకయని గుట్టువిడగొట్టిన కృష్ణ
నకునూ పుట్టితే యేమాయ పుట్టినిదిగని తిరిగి పుట్టువన్నట్టి
అర్జునా యుద్ధవులకూ ॥జయ మం॥

5. సాధనంబులులేని బోధతా బయలన్న శ్రీధరస్వాముల శిష్య
రత్నం రాదూపోదూ బయలులేదు యెరుకని యన్నసీదాగరా
మడగు శివరాములకునూ. ॥జయ మం॥

6. నామరూపము లేని స్వామి బయలనియన్న ఆమహా కంబలూ
రప్పగురునకూనూ భూమి నిర్జరు పరశురామ సీతారామస్వామి
పూర్ణాబోధ సద్గూరునకూ. ॥జయ మం॥

7. రాజా రాజా మహా రాజయోగీ అచల రాజగురు భాగవత కృష్ణ నకునూ రాజఋషి బ్రహ్మఋషి పూజలూగాంచి రాజిల్లు ఫీల్ఖాన లక్ష్మణునకూ
॥జయ మం॥

8. పరిపూర్ణ బోధను బట్టబయలుగజెప్ప వరకొమరగిరి లక్ష్మ రావునకునూ ధరలో కొమరాబండ గురుపీఠ మందునా అరయ నేంద్రాగంటి హన్మదార్యులకూ.
॥జయ మం॥

9. నీమనిష్టలులేని భూమ అచలంబని కామితార్థములిచ్చె ఘనున కిపుడూ నాయకన్‌గూడ గ్రామ గురుమందిరంబునా స్వామి ఆకవరపు రామాచార్యులకూ ॥జయ॥జయాజయ మం॥

10. అచలంబు అంతటా నిండ్నది నిజమని పూర్ణబోధను దెల్పె ప్రభునకిపుడూ సంశయములన్నియు సరిదిద్దినట్టియు. సంకోజు రామచంద్రాచార్యులకునూ. ॥జయ॥జయా॥మంగ॥

11. అచలచలనముగానిఅచలమున్నదియనుచు సచలమెన్నడులేని సందిదెలిపి అచలమున లేనెరుక లేనేలేదనుచును ప్రచుర పరచు లంకరంగమాంబకూ.
॥జయ॥

12. ప్రవిమలంబైనట్టి పరిపూర్ణమును యెరిగి సవినయంబుగ సాధు సజ్జనులకూ క్రమముగా యెరిగించి కడతేర్చునటువంటి అమలానంద సరస్వతాంబ కిపుడూ.
॥జయ మం॥

Y. Sudarshan Reddy
44/3 RT, Vijayanagar Colony,
HYDERABAD - 500 457.

-స మా ప్త ము-

view our videos in our blogs&share:

https://telugudevotionalswaranjali.blogspot.com/

https://gitamakarandam.blogspot.com/

https://hindudevotionalswaranjali.blogspot.com/

https://sundaravignanagrandalayam.blogspot.com/

https://chaitanyavignanam.blogspot.com/

https://telangana-gundechappudu.blogspot.com/

యూట్యూబ్ CHANNELS :

CHAITANYA SWARANJALI

https://www.youtube.com/@chaitanyaswaranjali7979

భారత చైతన్య జ్యోతి

https://youtube.com/@BHARATH_CHAITANYA_JYOTHI

జై గిరిధారి https://youtube.com/@jaigiridhari9054

GITAMAKARANDAM

https://youtube.com/@gitamakarandam7244

https://archive.org/details/@sudarshan_reddy330